# కుమార విజయము.

(తెలుగు నాటకము)

గ్రంథకర్త:

ములుగు సుబ్రహ్మణ్యారాధ్యులు

ప్రకాశకులు

మం. రా. ఆకారపు నరసింగం గుప్తగారు

విశ్వేశ్వర దేవాలయ ధర్మకర్తగారు

వరంగల్ (N. S. Ry.)

ఈశ్వర ముద్రాక్షరశాలయందు ముద్రింపఁబడియె,
స్టేషన్ రోడ్, వరంగల్.

1950 [ వెల రు. 1-0-0

- Placement Assistance.

Gama Solutions Inc. is a subsidiary of Gura Information Solutions USA, formed with an aim to provide world class services in CAD/PDM areas to both domestic and international customers.

ఓం.

# కుమార విజయము.

(తెలుగు నాటకము)


గ్రంథకర్త:

ములుగు సుబ్రహ్మణ్యారాధ్యులు

జగ్గయ్యపేట, (కృష్ణాజిల్లా)



ప్రకాశకులు

మ. రా. ఆకారపు నరసింగం గుప్తగారు

విశ్వేశ్వర దేవాలయ ధర్మకర్తగారు

వరంగల్ (N. S. Ry.)




[వెల రు. 1-0-0

# పీఠిక.

ఈ కుమార విజయ నాటక కర్త, ములుగు సుబ్రహ్మణ్యారాధ్య కవి. వీరి నివాసము నందిగామ తాలూకా జగ్గయ్యపేట గ్రామము. వీరి జనని సుందరమ్మగారు. జనకులు అయ్యవార్లుగారు. సోదరులు వీరభద్రశాస్త్రిగారు. వీరిచే రచింపబడిన శతకములలో చంద్రమౌళీశ్వర శతకము రాజేశ్వర శతకము, అచ్చుపడినవి. శంభులింగ శతకము, మొదలగునవి ముద్రించవలసిన శతకములు వీరివి యింకను కొన్ని గలవు. అందు శైవమత విషయము లొక్కొక్కటి యొక్కొక పద్యమున నిమిడ్చి వ్రాయబడినవి.

శ్రీ. సుబ్రహ్మణ్యారాధ్యులవారి జనకులయిన అయ్యవార్లంగారిచే శివరహస్యఖండము(అచ్చుతెలుగు) కాత్యాయనీ చరిత్ర (౫ ఆశ్వాసముల పద్యకావ్యము) అను రెండు పుస్తకములు రచించబడినవి. వారు తీర్థయాత్రల చేయు సమయమున ఆయా దేవతలగూర్చి చెప్పిన పద్యములు కలవు. శివపూజా వ్రతములు, శివస్తోత్రము లనేకములు ముఖతః వర్ణించి కార్తీక గణార్చనల యందు చదువుచుండువారు,

ఏతన్నాటక కర్తయయిన సుబ్రహ్మణ్యారాధ్యుల వారిచే రచింపబడిన గ్రంథములు. 1. వీర విహారము, 2. లీలా మానుషము, 3. కన్యా కైవల్యము, 4, కుమార విజయము, ఇవి నాటకములు. 5. శివానుగ్రహము, 6. ధీరకర్ణ

కము. 7. కుమార భాగవతము (యక్షగానము) 8. గౌరీ కళ్యాణము (యక్షగానము) 9. ఇచ్ఛినీ కుమారి. ఈ 9 పుస్తకములలో 1, 4, పుస్తకములచ్చయినవి. వీరికవిత్వము సరసముగా నుండును. హృదయగత భావమును, ప్రతి పద్యమునందును, పాఠకులకు సుబోధకమగునటుల వ్రాసి యున్నారు.

ఈ కుమార విజయ నాటకము మ॥ రా॥ ఆకారపు నరసింగంగుప్తగారికి కృతి యొసగబడినది, ఈ గ్రంథము ముద్రణమునకు ద్రవ్యసహాయ మొనర్చిన మ॥ రా॥ ఆకారపు నరసింగంగుప్తగారికి విశ్వేశ్వరుడాయురారోగ్యైశ్వర్యముల ప్రసాదించుగాత.

శివసంబంధములయిన ఇట్టి నాటకముల రచించి ప్రజలకు శైవపురాణకథలను బోధించిన బ్ర॥ శ్రీ॥ ములుగు సుబ్రహ్మణ్యారాధ్యులవారికి పరమేశ్వరుడు మనోరథంబుల నెరవేర్చుగాత.

వరంగల్,
-10-50

ఇట్లు,
ముదిగొండ వీరేశలింగశాస్త్రి,

శ్రీ శివాయగురవేనమః

# కృతిపరిశంస.

ద్విపద— పరమపవిత్రమౌ భరతఖండమున
వరయాంధ్రదేశమం దిరవొందునట్టి
నైజాము రాష్ట్రంబు నందొక్కచోట
భూజనంబుల కల్పభూజమౌ యనగ
అలరు శంషాబాద యనుగ్రామమందు
కలరార్య వైశ్యులౌ కారపువారు
మాసంతగోత్ర సంభవులై ధరిత్రి
వాసిగాంచిరి మంచి వ్యాపారులగుచు
అందు గుర్వయ్య శెట్టి అతిసమర్థుండు
పొందుగా నాతని పూబోడి నాగ
మాంబయన్పేరున నలరారు సాధ్వి
పంబిన వేడ్కతో పతిభావ మెరిగి
సతతంబు వర్తించు సత్సతీతిలక
మతిగుణవతియును ఖ్యాతి నార్జించె
ఆదంపతులకు మహాదేవు కరుణ
సాధువౌ సింగయ్య జననంబునందె
అంతట వారల కత్యానందమంది
సంతతోత్సవముల చాలనొనర్చి
అల్లారుముద్దుగా నాతని బెంచి

రెల్లరానవాని కెసగె యాపనము
అదిగాంచి తలిదండ్రు లా సమయమున
ముదిత గూర్పగ నెంచి మదినిశ్చయించి
ఎల్లమాంబికయను నింతికాతనికి
ఉల్లాసముగ పెండ్లి యొనరింపవార
లనవరతంబు ధర్మాసక్తులగుచు
దినములు గడుపగా దేవునిదయను
చెన్నయ్యయను నొక శిశువుద్భవించె
చిన్నివెన్నెలరేని చెలువునతడు
దినదినంబును వృద్ధి గనుచుండునంత
జనకుడాయూరివాసము నుజ్జగించి
ధరకరీంబాదను పురిబ్రవేశించి
పదునైన వ్యాపార భారంబుబెంచి
కొంతకాలమునకు నంతశాంతకుని
చింతజేయుచు శివు చెంతకునరుగ
అతని యిల్లాలెల్లమాంబ దుఃఖంబు
సుతుపురోవృద్ధికై మతివిసర్జించి
కొడుకగు చెన్నయ్య కమ్మ, వివాహంబు
తడయక జేయగా దగునంచునెంచి
మంచి సంబంధంబు నెంచి రాజమ్మ
ఎంచినకన్నె లే ధ్వంచు యోజించి
చెలగి వివాహంబు చేసి చెన్నయకు
కలుములజవరాలి కానాటనుండి
చెన్నయ్యపై ప్రేమ మిన్నంట నాత

జెన్నొ వ్యాపారంబు తెజిగిరోయినచ్చె
పట్టినదెల్లను బంగారమయ్యె
ముట్టినవన్నియు ముత్తెములయ్యె,
కట్టించినాడోయు గల్లుపురాన
దిట్టమౌ మేడలు దివ్యగృహాలు
సత్రంబుకన్యకా జననికి గుడియు
పాత్రుతౌననగశుం భద్భక్తిరక్తి
ఆకాలమునసుద్భటారాధ్యవంశ
సాకారశంభుండు శంకరగురుడు
సకలవిద్యానిధి శాంతాత్ముడమలు
డకలంకశివయోగి యాథాత్మ్యవేది
సతతషట్కాల.పూజాపరుడనఘు
డతులితలతుగ ణార్చ్యవతుండు
ఆపురమున.నిర తాన్నదానంబు
నోపికతో జేయుచుండ చెన్నయ్య
ఆనందమందిసో ద్యానంబుచెంత
జానగుభవనంబు శంకరప్రీతి
దానంబొనర్చెసుద్భట శంకరునకు
నానాటనుండిని త్యాన్నదానంబు
శంకరారాధ్యులా సత్రంబునందు
జంకక నెన్నేండ్లు సల్పెనో దెలియ
అజానతస్సైనవా నబ్బకస్సైన
భుజగేంద్రునకు,భోగి చూపమునకైన
ఇటులుండగానొక్క శిశ్వరేశ్వరుని

పలుదయ చెన్నయ్య భాగ్యంబుపండి
నరశింగ, ముదయంబు నంది దంపతుల
నరుదైన, ముదమున నలర జేయుచును
దినదినంబును పెంపు గనుచు, యవ్వనము
తనుజేరులోపల తగినవిద్దియల
సాధించి వ్యాపార సరణిలో పెద్ద
యోధుడై జనకుని యుద్యమంబునకు
సాయంబొనర్చుచు సజ్జనుండగుచు
హేయకార్యములందయిష్టుడునగుచు
వరలు, కుమారుని వైవాహికంబు
నెఱవేర్ప చెన్నయ్య నెఱినిశ్చయించి
భాగ్యవంతులయింటి పడుచయినట్టి
యోగ్య నవోఢ మహోత్సాహభరిత
మొలత, అనంత లక్ష్మినిగాంచివచ్చి
కులసతి, కెఱగించి కొడుకు మెప్పించి
అమితవైభవముగా సుముహూర్తమందు
క్రమముగా, కల్యాణ కార్యంబునడప
ఆ నూత్నదంపతు లమితమౌ ప్రేమ
మానుగా దాంపత్య మనుభవింపంగ
కొంతకాలమునకు కొమరుండు గలిగి
సంతసంబుగ, పది సంవత్సరములు
అంతరంగమున, కల్యానందమొసగి
వింతగా నతడు దేహాంతరంబునంద
ఆదుఃఖపరవశులై, చెన్నయా

లేదియు. వోపక మోదంబుదక్క
కొంత కాలంబుండి కొడుకునో దార్చి
అంత కాంతుని పాదాబ్జముల్ గొలువ
పనివిన చెన్నయ్య భార్యవెన్నెనుక
కనె నరసింగమా కాదౌష్ట్యంబు
ఇంతలో సంతునం దిచ్ఛ జనింప
కాంత సుశీలయు గ కన్యపెండ్లాడె.
ఆపె సుశీలయై యనవరతంబు
నోపికతో భర్త యుద్దేశములను
దెలిసి సేవింపగా దేవ్రుని కరుణ
కలిగియు కలుగని కాన్పుయెవ్వ నకట
ప్రారబ్ధ మనుభవింపక తీరదనెడి
ధీరుండు గావున ధృతినరసింగ
మేరీతి చింతిల కిష్టలింగమున
కారాధనము సల్పు నత్యంతనిష్ఠ.
ఇది మంచి సమయమంచెఱిగి శివుండు
మది, ప్రవేశించి, శుంభద్భక్తి బెంప
నానాటనుండియు నరసింగగుప్త
పూనిక విశ్వేశు పూజించువేడ్క
ప్రతిసోమవారంబు పరమేశుపూజ
అతులితంబుగ సల్పు నారాధ్యవరులు
విప్రవర్యులుగూడి వేదోక్తసరణి
సుప్రతధింబులౌ సూక్తులు నుడువ
అనుదినంబిష్ట లింగారాధనంబు

పనివడి జేయు శంభుభక్తితోడ.
అనువగు దేవాలయంబు నిర్మింప
పనిబూని ఓరుగల్లు పట్టణమందు
నడివీధి విశ్వేశునకు దివ్యమైన
గుడికట్టి ప్రాకార గోపురయుతము
దానప్రతిష్ఠించె, తరుణేందు ధరుని
దైనిక భోగముల్ సాగజేయుకొఱ కప్ర
శివకుటుంబము, పూజ సేయుటకొఱ కక్ష
తవిలి విప్రకుటుంబి తజ్ఞు నందునిచె
ఆరుమారులు నిగమాగమ స్వస్తి
కారాధ్యవర్య స్థానాచార్యు నునిచె
సంగీత వైద్య శాస్త్రాదుల గఱప
రంగుగా పాఠశాలలను స్థాపించె
జనకుండు గట్టిన సత్రంబు పాంథ
జనవాస యోగ్యమౌ సరణి గల్పించె
నిరతంబు విశ్వేశు నెదుట గానంబు
సలిపెడి గాయక సమితి నేర్పఱచె
మారారి ముదమంద మంగళవాద్య
కారుల నియమించె కట్టడిసల్పి
తనకిష్టలింగ ధారణ సల్పు గురుని
కెనలేని మేడ గట్టించి మోదించె
అనయంబు శివపూజకై పూలకొఱకు
ననువగు పుష్పవనంబు వేయించె
అన్నసత్రముసల్పె నభ్యాగతులకు

నెన్నొ కావ్యముల గృతిపడై వెలసె.
అకాలమందునే నావరంగల్లు
పట్టణంబుననొక్క పటిక్కినై యేగి
ఆనరశింగ, వైశ్యాగ్రణి. గాంచి
నేనొనర్చినకృతుల్ నెఱి వినుపింప
వినుల, విందుగా విని; సంతసించి
సేవాని, విజయంబు చిత్తంబు దనుప
ననుగాంచి, భక్తిప్రణామంబు సలిపి
అనఘ వేమారాధ్య నన్వయమందు
జనియించినాడవు సత్కవీశుడవు
గొనకొని మీరొనర్చినదౌ కుమార
విజయ నాటకమునా విజయంబుగూర్ప
భుజగ భూషునకును ముమ్మదమావహిల్ల
కృతిగూర్పుడనుచును ముమ్మతి నరసింగ
మతిభక్తినన్వేడ నా,గా, కటంచు
ఈయంగ బూనితి నీకావ్యమతని
కాయురారోగ్య, భాగ్యంబులు, గల్గి
శారీరకంబగు సౌఖ్యంబుగల్గి
కోరికల్, దీర్చెడి కొడుకులు. గల్గి
భారత వ్యాప్తమౌ కీర్తిగల్గి
ధారుణి. నాచంద్ర తారార్కవృద్ధి

వఱలియాకారవు నరసింగవంశ
మెఱవొందునట్లు విశ్వేశు బ్రార్థించి
అన్నపూర్ణాంబిక కంజలిసల్పి
పన్నగా విఘ్నేశు సన్నుతి జేసి
వీరభద్రుని గొల్చి భైరవుదలచి
గౌరీశసముడౌ కుమారుని బొగడి

కావ్యంబు నెల్లకాలంబు

సాదరంబుగ. ప్రదర్శనమాచరించు
నటుల, సంభావించి నానార్థవిఘుల
ఘటికులా, పండిత కవుల, మన్నించి
ఈకృతి, విషయంబు నెఱిగించినాడ
శ్రీకంఠుడు. శుభంబు చేకూర్చుగాక

మం గ ళం భ వ తు



కీర్తిశేషులు ఆకారపు చన్నయ్యగారు, వారి ధర్మపత్ని

# ఇందలి పాత్రలు



## పురుషులు.

అసురేంద్రుడు ... దానవరాజు
శుక్రాచార్యులు ... దైత్యగురువు
శూరపద్మాసురుడు ... దైత్యపతి
సింహావక్త్రుడు ... రాజుతమ్ముడు
తారకాసురుడు—రాజుచినతమ్ముడు
పరమేశ్వరుడు——వరప్రదాత
ప్రథముడు } రాక్షసులు
ద్వితీయుడు }
కశ్యపుడు ... మహర్షి
బ్రాహ్మణుడు ... ఈశ్వరుడు
దూర్వాసుడు ... మహర్షి
శిష్యుడు
వాతాపి } అజవక్త్రి కుమారులు
ఇల్వలుడు }
అగస్త్యుడు ... మహర్షి
నారదుడు ... దేవముని
దేవేంద్రుడు——స్వర్గపతి
శాస్త్రాభైరవుడు ... శివకుమారుడు
సుహోశాఖుడు ... ప్రమథుడు
భానుగోపుడు——శూరపుత్రుడు
దైత్యసేవకుడు ...
బ్రహ్మదేవుడు ... సృష్టికర్త
జయంతుడు ... దేవేంద్ర కుమారుడు
దండబాధుడు ... రాక్షసుడు
హిమవంతుడు ... పార్వతి తండ్రి
మన్మథుడు ... రతీపతి
వటుడు——శంకరుడు
శంకరుడు ... పరమేశ్వరుడు

## అష్టదిక్పాలకులు—మహేంద్రాలు.

కుమారస్వామి ... దేవసేనాని
వీరబాహ్వాదులు ... నవవీరులు
నందీశ్వరుడు ... శివమంత్రి
బృహస్పతి ... దేవగురు
అమోఘుడు ... శూరమంత్రి
అసురేంద్రుడు—తారకసుతుడు
విష్ణుమూర్తి ... వైకుంఠపతి

## స్త్రీలు.

సురస——అసురేంద్ర పుత్రి—మాయ.
అజవక్త్రి——శూరాదుల చెల్లెలు
మంగళకేశి——అసురేంద్రుని భార్య
హేవళంబి } అజముఖిసఖులు
విళంబి }
లోపాముద్ర ... అగస్త్యుని భార్య
శచీదేవి ... దేవేంద్రుని భార్య
మేనక ... హిమవంతుని భార్య
పార్వతి ... శివపత్ని
రతీదేవి ... మన్మథపత్ని
జయ } పార్వతి చెలులు
విజయ }
పద్మకోమల ... శూరునిపత్ని
దేవసేన ... కుమారపత్ని

# నాంది.

మ॥ దివిజౌఘంబును బ్రోవ దైత్యతతి మర్దింపంగ భక్తాళికిఁ
భవపాశంబుల నూడ్ప హైమవతి కానందంబు జేకూర్పగా
శివతేజంబున నుద్భవించి కరుణాసింధుండునై కుంభసం
భవతత్వార్థ వివేక దాత యగు సుబ్రహ్మణ్యుడో
మున్నిమ్ముఁ ॥





శ్రీ ఆకారపు నరసింగం గుప్తగారు, వారి సతీమణులు

ఓమ్.

శ్రీ మాత్రే నమః.

# కుమారవిజయ నాటకము.

## ప్రథమాంకము

[పాతాళమున శుక్రాచార్యులు అసురేంద్రుడు మాట్లాడుచుండ సురస వీవనచే విసరుచుండును]

శుక్రా— 'ఏనకేనాప్యుపాయేన ప్రసిద్ధః పురుషో భవేత్' నైరాశ్యము పురుషునకధః పతన హేతువు.

అసు— ఈ స్థితికి నేనే కారణమగుదునా?

శుక్రా— విధి ప్రాతికూల్యమునకెవరేమి చేయగలరు.

అసు— ఇక నిరాశ దురాశలకేమి బలముకలదు.

శుక్రా— వెఱ్ఱివాడా, కాలము బండిగిల్లు వంటిది ఓడలు బండ్లు బండ్లోడలు కావచ్చును ఇపుడు నీకు శుభకాలమని మా బుద్ధికి దోచుచున్నది.

అసు— మహదాశయము ఫలవంతముగదా!

శుక్రా— సందేహమేమి

మ॥ భవదీయాత్మజయొల్లవిద్దియలలో బ్రావీణ్యమున్గాంచి
మహానివరేణ్యుండగు కశ్యపర్షి దయచే నిర్భీక సంతాన సం
భవసౌఖ్యాంబుధి నోలలాడు సురసౌ భాగ్యంబు భోగ్యంబుగా
నవు చింతింపకు మానసంబున శివుగా ధ్యానించి పూజింపుమా॥

అసు— మహాత్మా తమయాదేశమెన్నడైన నుల్లంఘించితిమా
కాని యొకసంశయము మమ్మొ బాధించుచున్నది.

శుక్రా— వెఱపేల అదేదో చెప్పుము.

అసు— ప్రశాంతతపస్వియు విజితేంద్రియుండగు కశ్యపబ్ర
హ్మర్షి అమర పక్షపాతిగదా.

శుక్రా— నీవీ విషయవిమర్శన మొనర్పకుము అన్నిటికిని
కాలమే ప్రమాణము.

అసు— చిత్తము.

శుక్రా— ఆలసింపక కార్యోన్ముఖుడవగుము,

అసు— తమయాజ్ఞ కాని,

శుక్రా— అడుగడుగునకేను మహాన మెందుకు నీకూతురు సురస
మావలన సకల విద్యారహస్యము తెలిసెంగెనది.
యీపెకేమి మాయాభిదాన మొనర్చితిమి, ఈ క్ష
ణముననే యీమె నా మహాసీయుని సేవకై నియో
గింపుము నీమనోభీష్ట మీడేర్పగలదు—[పోవును]

అసు— అమ్మా వింటివిగదా. గురునియాజ.

సుర— తండ్రీ సర్వదా శ్రేయోభిలాషియు అగతానాగత
వేదియునైన భార్గవుని యాజ్ఞ పాలింపదగినదికదా.

అను— విజయే కాని యీ విషయము విప్రుతో చెరలాటము

చ॥ అతడు జితేంద్రియుండగు మహర్షి సతంబు బ్రజాంతచిత్తుడై।
మతిని చలింపనీయక సమాధివశంగతుడై ప్రపంచ సం।
గతులకు దూరుడై వలయు కర్మము దాతనికోపవహ్నికా।
హుతియగ జేయు దుర్నిధియయుల్లము తల్లడమందజేసెడున్॥

అదియునుంగాక వెన్నంటి మనల బరిమార్ప యత్నిం
చు దేవతల విషయమును కుర్తిరింగి కేని నీకపాయ
మొనర్పక మానరు,

సుర— జనకా మొదలనే సంశయించి విరమించుట కార్య
శూర లక్షణము కాదు.

అను— అమాట సత్యమే నీవనుకార్యముపశ్యవగు సుకుమారివి
అతడా వనవాసియగు తపస్వి. ప్రయత్నమా
దుర్ఘటము

సుర— పితా కార్యోన్ముఖులు కష్టములు లెక్కింతురా.

అను— ఏమో నా మనమాందోళనము చెందుచున్నది.

సుర— అది సహజమే అపత్యప్రేమ.

అను— అమ్మా ఇయ్యది అంధానురాగము కాదు. యీ దేవ
తాధములవలన నేనెన్ని యిడుములగుడిచితినో నీవే
యెఱుంగుదువు.

సుర— తమ మాటలయందు సత్యమున్నమాత్రము కాన
రాదు కాని భార్గవుని మాహాత్మ్యము మాత్రము.

అసు- నేనెఱుంగననియా నీయుద్దేశము.

సుర- అయిన నీ భయమెందులకు,

అసు- ఇది భయముకాదు.

సుర- నైరాశ్యమా,

అసు- (నిరుత్తరము)

సుర- ఏమో మీ యభిప్రాయమిదమిద్ధమని నిర్ణయింప రాకున్నది.

చ॥ ఇదివఱ కెన్నిమారులొ జయించిరి దైత్యులు దైవకోటిని ।
వదిగమునించియున్ మనమునందున ధైర్యము నూనకెంతి సం
పదలు తిరంబులై యొకని పజ్జవసించునె యెన్నడేని నా ।
పదలు నశింపకుండునె శుభంకర కాలము దాపురించినన్ ॥

అసు- నీ మనోధైర్యమే నాకు కొంత ఆశను పురికొల్పుచున్నది.

సుర- జనకా నా సామర్థ్యమును గుఱించి చెప్పుకొనుట తప్పైనను తప్పదుగాన వినుడు.

మ॥ అణిమాద్యష్టవిభూతి భూషితుడు శుక్రాచార్యవర్యుండు, తా ।
నణు మాత్రంబును సంశయంబుగొన కవ్యాజానురాగంబు చే ।
మణిమంత్రౌషధ యంత్రతంత్రముల సామర్థ్యంబు బోధించినన్ ।
గణనాతీతను జేసె నా ప్రతిభ కింకన్ వంక జేకూరునే॥

అసు- అద్భుత మద్భుతము.

సుర- జనకా వినికిడిచేనే విస్మయమయ్యెనా,

చ॥ కనుగొని సంతసింపగల కాలము చేరువయయ్యె నిప్పుడే ।
చని మునిసైన కశ్యపుని స్వాంతము రాగిలజేసి మీనకే ।

త్వ చరణారవిందముల నార్చెద నాతని చిత్తవృత్తి మ
న్మనమున గల్గు వాంఛ లసమానములై సమకూరు నట్టులన్॥

అసు:- కుమారీ నీ యుద్యమము రాక్షస కులమునకు పరమో పకారకమైనను.

ఉ॥ పౌరుషమే ప్రధానముగ భావమునందు దలంచునట్టి దు
ర్వార పరాక్రమక్రమ విరాజితులైన సురారులందు నె
వ్వారలు గాని నిర్జరుల బాంధవముం జుసార గోరినన్
గౌరవ లేశమైనను జగంబున నిల్చునె కీర్తిదక్కునే.

కావున నింక నెంతకాలమైనను ఎన్నికష్టముల నైనను సంతోషమున ననుభవించెదనుగాని నేనీ నీచమున కొప్పను.

సుర:- తండ్రీ నీ వెంత ఛాందసుడవు. సర్వము నెఱింగిన చతురుపాయ ధురీణుండవయ్యును స్వాభిమానావేశమున చరిత్రనుగూడ విస్మరించితివి.

చ॥ అసురులకెల్ల మంత్రియగు నట్టిగురుండె స్వలాభ
కాంక్ష. నక్రమమని శంకయుంపక సురద్విషదేశిక సేవసల్పగా
కొమరితనంపి, దాన తనకుంగల కార్యములెల్ల, సానుకూ
లముగ నొనర్చికొంచడె తలంచెనె మానవిహీనముం జెడన్.

కావున నెట్టిఘనుండైన ప్రకృతము ననుసరింపక తీరదు. అదియునుంగాక అద్వితీయమౌన్నత్యాభిలాషియగు పూరుషుడు అవమానంబని లెక్కింపక అమానుషంబని వెఱువక అన్నిటికిని తలయొగ్గినపుడే కృతకృత్యుడగును.

అసు:- సీ, అవివేకినీ యిదెక్కడిమతము?

సుర:- కోపింపకుడు. దూరమాలోచింపుడు. పురుషులగు

మీరు సహింపగలరుగాని, ఇట్టి దీనదశకు మాతల్లి మొదలగు ఆడువారలెంత కుందుచుండిరో మీ రెరుంగరైతిరి.

[మంగళకేశి ప్రవేశించి] ఆడువారిగోల వారికేల.

ఆసు:- ఓహో నీవును సమయమునకే వచ్చితివా.

మంగ:- మనకు సమయాసమయము లెందులకు జీవచ్ఛవములముగదా.

అసు:- [తలవంచును]

మంగ:- ఇపుడు క్రొత్త తలవంపు లెచటనుండి వచ్చినవి.

సుర:- అమ్మా భార్గవులు మన్మశేయస్సుగోరి యొక మార్గముపదేశించిరి. అయ్యది తండ్రిగారికి రుచించినది గాదు.

మంగ:- ఆయనగారి కిటువంటిమాటలు రుచింపవు.

సుర:- వారు దూరాలోచనాపరులు,

మంగ:- కావుననే మనము ప్రశాంత చిత్తమున పాతాళవాసమొనర్చుచుంటిమి.

సుర:- అయ్యది కర్మానుభవము.

మంగ:- సరే యింకేమి వారు నిష్కామయోగులు, మీరు జ్ఞానయోగులు. సరిపోయినది,

సుర;- అమ్మా శాసింపకు,

మంగ;- ఇంతమాత్రముకూడ నేనెఱుంగనియా పేదవానికోపము; పెదవుల చేటుగదా.

సుర,- మాతా తొందరపడకు.

ఉ॥ మంచి దినాలలో జనుని నూనన మన్నిటు దెల్వి గల్గి వ
ర్తించును చెడ్డ కాలము నశించిన నేమియును పాలుపోక యో
జించిన దెల్ల వ్యర్థమయి చేసినవన్నియు బూదెలోన బో
ర్లించిన పాలరీతిని మలీమసమై చెడిపోవునట్టులన్॥

మంగ;- కావున నే నమిలినవానికన్న మింగినవాడు ఘనుడు కాదా. తండ్రికి మించిన బిడ్డవు.

సుర;, జనకా యిప్పుడైనను పరిస్థితులర్థమైనవా.

అను;- (నిరుత్తరము)

మంగ;- నీ వెంత వలపించినను వారి నిర్వికల్ప సమాధిపీడరు. ఎందులకీ యరణ్యరోదనము.

సుర;- అమ్మా శాంతింపుము [తండ్రితో]

గీ॥ గ్రుడ్డియై మాపలినుద్దయి ఘోర కాన ।
నమున వశియించు మునికి నందన నొసంగి ।
నట్టి శర్యాతి సద్వంశయందు నద్వ ।
తీయు గౌరవమంది సుఖింపలేదు॥

అను;- అమ్మా నీయిష్టముఃవచ్చినరీతి నొనర్పుము. పైన దైవమున్నాడు

సుర- 'మద్భాగంతు మనుష్యాణాం సప్తమం దైవ చింతనం' ఎన్నిటికైన దృఢవ్రతమే ఫలప్రదము,

అను- మంచిది 'శుభస్యశీఘ్రం' నేడే పయనింపుము.

సుర;- (తల్లిదండ్రులకు నమస్కరించి బయలుదేరును)

అను:- బిడ్డా- దైవమనుకూలించుగాక 'యశ్శివో నామరూ
పాభ్యాం యా దేవీ సర్వమంగళా తయోస్సంస్మరణా
త్పుంసాం సర్వతో జయమంగళం'

మంగ- అమ్మా సుఖముగా వెళ్లి శుభముతో రమ్మా.

[తెరపడును]

## ద్వితీయ రంగము

[అరణ్యమున కశ్యపమహర్షి సమాధియందుండి
మాయా నాట్యమున తెలివొంది చూచుచుండును]

మాయ— -గేయము

మంజుళ పుష్పసుగంధ బంధురము మధుమాసము
ఆనంద తుందిలము। కుంజపుంజముల, కోకిలానంద
కోమల గాన విజృంభణోల్బణము ॥మం॥
కుసుమాసవ పానమత్తమధుకర ఆసదృశఝంకా
రావయుతము । అసమాస్త్ర విహారారామము సం-
తసమొసంగెడి వసంతాగమము ॥మం॥ (నాట్యమొనర్చు)

కశ్య- ఏమి యీ నవయౌవన వికాసము.

మాయ—(పూలుగోయుచు) గేయము-

ననుగని కిలకిల నవ్వుచున్నారా నాగోరుల కొనలైన
చిలతురా। పనివడి రేపే పరువముందువా బాగో
ల లెక్కింప దలపరా ॥—(నాట్యమొనర్చును)

కశ్య— (తదేకదృష్టితో) బాగు బాగు అపూర్వ సౌందర్యము

గీ॥ పరువమున విర్రవీగెడి విరులగుత్తి।
తీగముగా నిల్చి వెలెడి మెఱుపుతీగ।

అందచందాల ప్రోవుయీ సుందరాంగి ।
యిచటనీరీతి మెఱయుట కేమికతము॥

ఇపుడు కార్యకారణ విచారములతో కాలయాపనముగాఁదదు. దుర్భరము దుర్భరము (మాయను సమీపింప నదృశ్యముగును) ఇదేమి విపరీతము (దిక్కులఁజూచును)

గీ॥ గగనమునుండి పడిన నక్షత్రమట్లు ।
మెఱసి మిఱుమిట్లు గొలిపెడి మేనికాంతు ।
లఖిల దిక్కుల వెదజల్లి యద్భుతముగ ।
మాయమయ్యె నిదెక్కడి మాయయొక్కొ॥

యీ బాలకాంగి తపోవన విహార మాకాంక్షించి వచ్చుటకు, కారణమేమై యుండునో దురూహ్యముగానున్నది.

ఉ॥ సుందరి మందయాన గమసుందనమేమె రెయెలఁగనట్టి ప్రా ।
ణైందుని భాస్య రెటులరగ నిందు భయంబిసుమంత లేక యీ ।
చందమునన్వినోదముగ హ్యాంతమురంజిల నేత్రయుగ్మ మిం
పొందగ పాడి యాడి యెటుపోయెనో యూహాతీతమయ్యెడున్॥

యీ మన్మథ సామ్రాజ్యలక్ష్మి యప్సరసయా.

సీ॥ చక్కని యౌవనప్రతిభ చెక్కులనెక్కొని మేనికాంతులన్ ।
చెక్కుల పిక్కటిల్లె గడిజేసిన మారుని హావభావముల్ ।
చక్కిలిగింతలన్ గొలిపి సంయమికైన గృహస్థధర్మకే ।
చక్కనిదంచు కాముకుని సల్పఁగజేయు నిదేమిచోద్యమో॥

మఱచినను మఱపునకురాని యీ మాయామోహిని మరల దర్శనమీయదుగాబోలు "విప్రాః పశ్చిమబుద్ధయః" అవివేకులగు ఛాందసులకు, కార్యనిర్వాహక శక్తి శూన్యముగదా. నా ప్రేమ మీఁదెగఁద్రింపకుండనా అసామాన్యయగు నీయప

యీ విషయము నెఱుఁగ జాలదా.

చ॥ నవరస భావ మేదురము నాతివిలాసము నాట్యగేయసం।
భవజనితప్రమోద మసమానము, నన్ననిశుద్ధ ఛాందస।
ప్రవరుని గాదలంచెనని భావముచెప్పక చెప్పుచున్న దిం:
కెవరయినన్ను గావగలరీ విపదంబుధి మున్గకుండగన్॥

ఇట్టి ఘనకార్యమున కొరులసాయము గూడ నపేక్షింపవల యునా. ఛీ ఛీ సిగ్గు సిగ్గు. అయిన నిపుడేమి చేయవలయు. మరేమున్నది పరమేశ్వరుని— ఆ పరమేశునకైనను పార వశ్యము బ్రసాదించిన యాతని సేప్రార్థింప వలయుగాని అన్యుని వలన నేమగును ఓమన్మథ భగవానుడా భవదీయ భక్తా గ్రేసరుడనగు నా మొరయాలింపుము గడచిన నాయపరాధ ముల మఱచిపొమ్ము చూచితివిగదా నావదు పాట్లు.

గీ॥ ఎవని పూవులబాణమీ రేడులోక
ములకు సంధానకరణియై పొలుపుగాంచు
నట్టి శ్రీకామభగవాను నద్వితీయు
భక్తి బ్రార్థింతు నిశ్చల భావమలర॥

మాయ— (ప్రవేశించి నాట్యము సల్పును)

—గేయము—

ఈ వెన్నెలరేలీ పన్నెలపూలీ చిన్నిగాడ్పులీ తిన్నెల సొగ
సేవారికైన నింపు నింపదే మావారున్నను మరులుగొల్పదే॥

( నాట్యము జేయును )

కళ్య— (త్వరగా సమీపించి) సుందరీ, నీకా నందియు వెం
దలకు యీ దిక్కున నీక్రీగంటి చూపులబఱపుము.

మాయ- (విలాసముగ జూచును)

కన్య- యువతీ మనల మన్మథదేవుడను గ్రహించినాడు.

మాయ- ఊఁ హూఁ (నవ్వును)

కన్య- బాగు బాగు.

సీ॥ పగను విచ్చినపూల పెనఁజల్లినట్టుల
చిరునవ్వు నవ్వెదే చిగురుఁబోఁడి

మాయ- (మొగము ముడిపెట్టును)

కన్య- పల్లెత్తు మాటాడ నొల్లని మనమున
మల్లె మొగ్గల నెల్ల మాల్లైనిడితె

మాయ- (మారు మోమిడును)

కన్య- చంద్రకాంతులనొక్క చక్కి నెక్కొనఁజేసి
అంధకారము జాడు మనుట దగునె

మాయ- (బెదరి చూచును)

కన్య- అదరి బెదరిన లేడి కొదమల చూపులో
నీ చూపులోఁ దెల్ప నేరితరము

మాయ- (పరుగెత్తును)

కన్య- (వెంటాడుచు)

గీ॥ కలికి నీలీలలకు నేనొ కండగాడు
సకలజనులుం భవిష్యద్విచారశూన్య
చిత్తులై మత్తులైరని చెప్పుచుంటి
నిందసత్యంబు లేదు పూర్ణేందువదన॥

మాయ- బాగు బాగు నీవొక యాదర్శ మహర్షివి.

కన్య- పారపాటు నేనొక కామేశ్వరోపాసకుడను

మాయ- నిజము నీవంతటివాడవే

కశ్య- ఫలము నీయధీనము

మాయ- నివురుగప్పిన నిప్పు

కశ్య- అగ్నికి శీతలంబిడజాలిన నీ సామర్థ్య మద్వితీయము గాదా.

మాయ- ఓ నింతవరకద్వితీయనే.

కశ్య- ఐన నిప్పుడా కొఱతదీరగలదు.

మాయ- బాగుబాగు అపధర్మము అవసరకర్మము.

కశ్య- యువతీ, నేనంత చంచలుడ గాను.

మాయ- ఆవిషయము నేనెఱుంగనిది కాదు.

కశ్య- నీవు నన్ననుమానించుచుంటివో, అవమానించుచుంటివో తెలియుటలేదు.

మాయ- నిప్పుతో చెరలాటమా?

కశ్య- కాంతా వెనుకటి కథలేల ప్రస్తుతము నీకు నేను విధేయుడను.

మాయ- స్వామీ! అర్థాయగు యీదాసి మీ యనుగ్రహ భాగ్యమున కర్హురాలగునా?

కశ్య- మున్నాటికి వేయిమార్లకు ఆజ్ఞాపింపుము.

మాయ- ప్రభూ! అబలను గదా?

కశ్య- భయపడుచుంటివా!

ఉ॥ గడ్డము మీసముల్ బెనిచి కావులగట్టి యరణ్యభూముల
గడ్డలు దుంపలుఁ దినుచు కానని కంతలలో తపించు నీ

రెడ్డైతనంపు సంయమికి నిట్లొనగూడును సౌకుమార్యమున్
చెడ్డతలంపువీడి నను జేకొన నీకగు సర్వసౌఖ్యముల్.

మాయ- ధన్యాస్మి ధన్యాస్మి.

కశ్య- కామినీ ఇపుడు నీకేమి కావలయునో కోరుకొనుము.

మాయ- మహాప్రసాదము, అడుగనిది అమ్మవైనను పెట్టదు గదా.

కశ్య- సందేహమేల వచింపుము.

మాయ- త్రికాలవేదులగు మీరెరుంగని దేమికలదు.

కశ్య. ఈ యల్పవిషయమునకు తపోవ్యాసమేల?

మాయ- తమ యాజ్ఞ మీరరానిదిగదా.

కశ్య- త్వరగా జెప్పుము.

మాయ- అది మీకొక పెద్ద విషయము కాదు

కశ్య- ఇచట పెద్దచిన్నలతో పనేమి?

మాయ- చిత్తము విన్నవింతును.

కశ్య. సావధానుడను.

మాయ. మహాత్మా నేను.

గీ॥ ఎప్పుడే రూపమును దాల్తు నప్పుడీక
లా స్వరూపంబుదాల్చి నాయాత్మతృప్తి
పల్కుమరటంచు ప్రార్థింతు సంయమీంద్ర
అడితప్పనివారు మీరనుచునమ్మి.

కశ్య. ఇంతమాత్రమునకే యింత సందేహమా నీ కోర్కె నెరవేరగలదు. [కరగ్రహణ మొనర్చును]

( తెరపడును )

# తృతీయ రంగము

—అరణ్యమున రాక్షసులిరువురు ప్రవేశింతురు—

ప్రథ- ఛీఛీఛీ వెధవసంత ఇంత బ్రదుకు బ్రదికి యింటివెనుక జచ్చెనన్నట్లు చివఱకు యీ పనికిపిగినాడా చచ్చు సన్నాసి.

రెండ- ఏమిటోయి యిది. యెవరిని నీవనేది

మొద- ఎవర్నైతేనేమి చివఱకు పరువుమర్యాదలు పాడయ్యే రోజొచ్చింది-

రెండ- అరే, చెప్పమంటే, చెప్పవేమోయి

మొద- చెప్పేదేమిటి అందరికి తెలిసినదాన్ని అదిమిపెడితే మాత్రందాగుతూందా

రెండ- ఎంతసేపటికి విషయం తేలనీయవేమి

మొద. నీవొక బద్మాషువు తెలిసికూడా అడుగుతావు

రెండ- కాదబ్బాయి ఫలాని సంగతంటే కాదు. తెలిసేది

మొద- మొదట మనరాజు చాలా తెలివితక్కువపని జేసినాడు

రెండ ఏంచేసేడోయి,

మొద- ఏంకావాలి, యింతకంటె

రెండ- చెప్పరా నీ దుంపదెగ,

మొద- మనకు వాళ్లకి యెప్పుడు సరిపడదుకదా ఇంత తెలివి తక్కువపనా జేసేది,

రెండ- ఆ యేడుపేదో యేడువరాదోయి,

మొద- అమసలి దేవయ్యకు ముద్దుల కూతుర్ని సమర్పించాడు
రెండ- ఓరి మొద్దబ్బాయి యింతేనా నీ తెలివి తేటలు దీంట్లో యెంత రహస్యముందో యెంత రాజకీయ ముందో గుర్తించావా,
మొద- పెద్ద పెద్ద మాటలు శుద్ధ మొద్దు చేష్టలు,
రెండ. ఓరి దద్దమ్మా యిది సామాన్య విషయంగాదు.
మొద- ఆ మహద్విషయ మేంటో, మాబోటి వాళ్లు విని సంతోషింపగూడదా.
రెండ- అట్లా దారికిరా ఇప్పుడు మన అమరేంద్రుడు ఏపని లోనున్నాడో, తెలుసుకున్నావా.
మొద- చిత్తం దాన్నిగూడ తమరే సెలవీయండి.
రెండ. ఒక మహాత్మునకు మామగారైనారు.
మొద- సరే పరువుపోయినా మరియాద దక్కిందన్న మాట,
రెండ- నీవు పట్టి పరమ మూర్ఖుడవు,
మొద- కావచ్చు,
రెండ- విను మనగురువుగారంత వారు అలోచించి ఆ జేసిం చినదే గాని అల్లాటప్పా గాదు.
మొద- ఇంకేం వారేవీరు వీరేవారు.
రెండ- అదేమిటోయి,
మొద- ఏమి లేదు వారిబిడ్డను వీరు, వీరి బిడ్డను వారు పరిగ్ర హించిన వారేగనుక వారికీయంతర్వర్ణ వివాహాలు, అలవాటైన వే,

రెండ— నీ మొగం నీమోరవినూ,

మొద—ఆ మహర్షులవారిని యీ మాయాదేవిగారు రంగుజేసి దేశవాళ్లీలోకి దింపారన్నమాట.

మొద— తర్వాతమాట జెప్పవేం

రెండ— చెప్ప దేవిటీ ఒగ్గ జాల్లాటి వాళ్లు ముగ్గురు కొడుకులు ఒక కూతురు వారికిదగిన పరివారాలతోటి, జన్మించారు.

మొద— వీరందర్ని చూసేసరికి వారికి కాళ్లు చల్లబడి దేహం చలించారన్నమాట.

రెండ— ఆమహర్షి అక్కడినుండి వెళ్లిపోయినాడు.

మొద— తర్వాత

రెండ— తర్వాత సంగతి యేమి తెలియకపోవుటచేత నన్నా సంగతి విచారించి రమ్మని గురువుగారంపినారు.

మొద— సరే ఆలస్యమెందులకు వెళ్లుదాంపద (పోదురు)

(తెరబడును)

# చతుర్థ రంగము.

— ఆరణ్యమున మాయయు పుత్రులును ప్రవేశింతురు —

మాయ — నాయనలారా త్వరపడి యేపనిని చేయరాదు
పుట్టుకతోడనే బుద్ధిమంతులగు మీరు సామాన్యులైనను
దివ్యులతో డీకొనుటకు దివ్యశక్తులే కావలయును.
అయ్యవి పరమేశ్వరానుగ్రహమునగాని చేకూరవు.

శూర — మాతా నీ వింక వెఱటితోవనే యున్నావు. ధైర్య
స్థైర్యములకన్న దివ్యశక్తులు, గలవా,

మాయ — బాబూ చిన్నవాడవు.

సింహ — తల్లీ మా శక్తి సామర్థ్యములు నీ వెఱుంగవు,

మాయ — నే నెఱుంగకున్న నెవ రెఱుంగుదురు,

తార — ఎఱిగియే భయపడుచుంటివా

మాయ — తండ్రీ భయముగాదు అనుభవజ్ఞులును మహాయోధ
ధురీణులగు వారిని వంచించుటకు కేవల బలపౌ
రుషములే యుపయోగింపవు

అజవక్త్ర — అమ్మా పిఱికిమందు పోయుచుంటివా,

మాయ — తండ్రీ అనాలోచితకృత్యము తగదు ఆచార్యోప
దేశ మందని వారికపజయము తప్పదు.

శూర — జయము జయము రాక్షసకిశోరములకు,

మాయ — నాయనలారా గురుదేవులకు నమస్కరింపుడు.

( శూరాదులు నమస్కరింతురు )

శుక్రా-రాక్షస వంశోద్ధారులారా సర్వథా, మీకు జయ
మగుగాక,

ఉ॥ ఏను సురారిలోకమున కెల్ల శుభంబుల గూర్చువాఁడ నా
యోగతి మీరలీశ్వరుని యాగ్మకుత్త్రిక్తిగ వీరయాగమున్
బూనియొనర్తురేని పరిపూర్ణ మనోరథు లౌట సత్యమౌ
గానవివేకవంతులయి గ్రక్కున తత్క్రతువాచరింపుడీ॥

శూర- చిత్తము (తల్లితో) అమ్మా గురుపియాజ్ఞ శ్రేయో
దాయకమైనను సామాన్యకృత్యము కాదుగదా
మేమెట్లో నర్పగలము.

ఉ॥ శక్తికిమించినట్టిపని సల్పగ దేశికు డాజ్ఞనిచ్చె, న
వ్యక్తములం తమ్మ్రతేమెఱుంగ రట్టి పంస్థితి వీరయాగమున్
రిక్తుడనెట్లొనర్తు జననీవచియింపుము కానిపోనియా
సక్తిని వెల్లడించిన యశంబు దొరంకటగాక నేమగున్॥

మాయ-తండ్రీ యిదియా నీసంశయము యాగమునిర్విఘ్న
ముగా, కొనసాగుటకు నా సర్వశక్తులు వినియోగించి
సమస్త సంభారములు సమకూర్చెద,

శుక్రా-యువకులారా మీతల్లిప్రతిజ్ఞ వింటిరిగదా ఆమెతెలం
చిన ముల్లోకములు తల్లిరాగలవు శుభస్య శీఘ్రం
కార్యోన్ముఖులు కండు. రెండు మంత్రోపదేశం
బొనర్చెదను.

—తెరపడును—

# పంచమ రంగము.

—యజ్ఞశాలలో సింహవక్త్రుడు నిలుపబడి ప్రార్థించుచుండును.—

సింహ—పరమేశ్వరా మేము నీకేమి యుపచార మొనర్చితిమి,

చ॥ విధి విహితంబుగాఁ, సవనవేది భవద్యజనంబొనర్చినన్
వృథయయిపోయె సోదరులు ప్రేల్చిరి దేహములెల్ల నీకృపా
సుధజిలికింపవైతి, విశజూ విరలాభములేదటంచు. నా
కథను సమాప్తి జెప్పుమను కాగల దేదియునన్ సదాశివా.

(సింహవక్త్రుడగ్నిగుండమున దుముకబోవ వృద్ధ
బ్రాహ్మణుడరుగుదెంచి)

బ్రాహ్మ-అగుమాగుము యేమియీ సాహసము

సింహ—(నిరుత్తరము)

బ్రాహ్మ-మాటాడవేమి నీకేమైన మతిభ్రమణమా

సింహ-స్వామీ మాగోడవమికేల మీదారిని మీరుపొండు,

బ్రాహ్మ- అయ్యయ్యో ఇంతయనాలోచిత కృత్యమా
(ఋత్విజులజూచి) మీరుగూడ యీ యాత్మహ
త్యను ప్రేరేపించితిరా యేమి యీయన్యాయము,

తే॥ గీ॥ పనికిమాలిన ధర్మముల్ బలికి, యితని
కలధనంబెల్ల బూడిదలోగలిపి, తుదకు
ప్రాణములుగూడ దీయగాబూనివారె,
బాగు విజ్ఞానమున నిటువంటిదో ని॥

(సింహవక్త్రునితో) వెఱ్ఱివాడ చచ్చిన వెనుక నేమిచేయుదువు
'జీవన్ భద్రాణి పశ్యతి' యనిగదావృద్ధోక్తి

సింహ-బ్రాహ్మణోత్తమా యెట్టులేని జీవించుటయే పరమా
వధియా విద్వాంసులు మీరెట్లైనను మాట్లాడగలరు

ఆ॥ వె॥ పది దినంబులైన పరువు మర్యాదలం
గలిగి బ్రదుకవలెను గాని, పెద్ద
కాలమెట్లో బ్రదుకగా, సార్థకంబేమొ
తెలియమంటినో సుధీవతంస॥- నో

బ్రాహ్మ- వెఱ్ఱివాడా ఎట్టులేని జీవితము రక్షించుకొనుటయే
కర్తవ్యముగాని వేరొండేమియులేదు.

ఆ॥ వె॥ పుడమి, సకలవస్తువులను వెలబెట్ట
వచ్చుగాని. ప్రాణవాయువునకు
నించుమించు దీనికిది వెలయనిపల్క
నెవ్వడేని సాహసింపగలడె॥

సింహ-నిజమే దాన్నినేనను పదిలపఱుపు నుపాయమువలదా
బ్రాహ్మ- నీప్రయత్నమందది మృగ్యముగదా
సింహ-కాదు నాప్రయత్నమంతయు దానికొఱకే
బ్రాహ్మ- అయ్యది యీయగ్నియొసంగునా
సింహ- నాయమొవర్పగలదు.
బ్రాహ్మ- ఏవిధానముననో,
సింహ- సమస్తదేవతలీతని ముఖమునసేగదా తృప్తిబొందుట
బ్రాహ్మ- ఇదియొకదురాశ
సింహ-కాదు సనాతనమగు వైదికనిశ్చయము,
బ్రాహ్మ- మూఢవిశ్వాసము
సింహ- మీరు నాస్తికులవలెనున్నారు.

బ్రాహ్మ- నీయాస్తిక్యమే మొసంగినది.
సింహ- ప్రమత్నలోప ముండగూడదా,
బ్రాహ్మ-ఇంకేమిలోపము య్యా ప్రాణమునే పణమిడితివిగదా
సింహ- సోదరులు తృణప్రాయముగా నాత్మార్పణ మొనర్చిరి.
బ్రాహ్మ- ఏమేమి యీ యగ్గిలోబడి మగ్గినారా,
సింహ- అవును నిర్భయముగా,
బ్రాహ్మ- వారిగతి కనులారగాంచినను నీబుద్ధి మారదేమి
సింహ- సర్వథా వారి మార్గమే శరణ్యము.
బ్రాహ్మ- అనాలోచితముగా తొందరపడుచుంటివని నాయభి ప్రాయము,
సింహ- మీ యభిప్రాయమెట్టిదైనను మా సంకల్పమునకు వికల్పము లేదు.

తే॥ గీ॥ కల తను మనో ధనములు, శంకరునకొసగి
యతనిదయకేను పాత్రుడనైతి నేని
అపుడె పదివేలు నాకబ్బినట్టులెంచి
సంతసించెదగాక నిస్సంశయముగ॥

(అగ్నిగుండమున దుముకబోవ భగవత్సాక్షాత్కారమైన సింహపకృద్ధు నిశ్చేష్టుడై కొంతవడికి తెలివొందె.)
సింహ- ధన్యోస్మి ధన్యోస్మి పరమేశ్వరా ఇన్నినాళ్ళకు కలిగెనా నీదయ మామీద. దేవాదిదేవా,

శా॥ నాతోబుట్టువులెల్ల నీకొఱకు ప్రాణంబుల్ సమర్పించియుం
చేతఃప్రీతిని గాంచరైతిరసుచున్ జింతించుచున్నాడ యీ

రీతిన్ భక్తునివేవస్యాయమె కపర్ది దీనులన్ బ్రోతువన్
ఖ్యాతిన్ నిల్పుకొనంగ ధర్మముగదా యాలస్యమున్ మానుమా.

పరమేశ్వరా సర్వమును నీకు సమర్పించిన వారికైనను కరుణింపనిచో నీవు భక్తపరతంత్రుడవెట్లాదువు. దయానిదీ విధ్యుక్తముగా నొనర్చిన సపర్యయు విఫల మొనర్తువా. శంకరా, నీకింకరులమయిన మావలన నేదైనయుపచారములున్న క్షమింపగూడదా, త్రికరణశుద్ధిగా మేమొనర్చిన వీరయాగము దుర్యోగమా గిరిజాపతీ. పరమోదార చరితుండవగు నీకు నేనేమని మొరపెట్టగలను. "కోటి జన్మార్జితైఃపుణ్యైః శివేభక్తి ప్రజాయతే" యనిగదా వ్యాసోక్తి, కావున నీజన్మముననే మిమ్మారాధించినవారము కాముగదా ఇంకెన్ని జన్మములకైనను మిమ్ముమరువము మిమ్మర్చించుట మానము తెలిసినదా మాదృఢవ్రతము. ఇంక మాయదృష్టము ప్రభుని చిత్తము,

పర- భక్తాగ్రేసరా నీదృఢభక్తికి సంతసించితిని. నిస్సంకోచముగా వాంఛింపుము. త్వరితముగా నీమనోభీష్ట మీడేర్తును.

సిం:హా- స్వామీ! యెంత చమత్కారివయ్యా, అనధికారినగు నేనా మిమ్మర్థించుట!

పర- అట్లైనన్నటికిని దలంపకుము, నీకిపుడు కర్మాధికారములు కలవు.

సింహ- దేవాదిదేవా ఇదేమున్యాయము మిమ్మేదియర్థించిన
ను మాయగ్రజునిదిగదా యధికారము. కావున నా
సోదరుల బ్రోదికింపుము. అట్లుది నీకిష్టము లేనిచో
నిష్కామయోగమును బ్రసాదింపుము.

పర- నిష్కామ యోగమునకు బ్రసాదమొందుటకు సిరిరా
మోకాలొడ్డు వారుందురా.

సింహ- స్వామి కించిజ్జ్ఞుడనకు నాకా మీతో వాదము,

పర- ఇపుడు వాదప్రతివాదములతో యవసరమేమి నీమనో
భీష్ట మెఱింగింపుము.

సింహ- సదాశివా మీరే పరీక్షింప దలచినచో మాకు దిక్కె
వరు. నాదురదృష్టమిట్లున్నది. [కన్నులు మూయును]

పర- అతివిచారమున మునుంగకుము. ఇటుచూడుము.

[శూరపద్మాదులు బ్రతుకుదురు.]

సింహ- [చూచి] మహాప్రసాదము.

శూర- నమస్తే పరమాత్మా,

తే॥ గీ॥ కలదుకలదన్న వారికి కలడటన్న
వాక్యమును సార్థకము జేయ వచ్చినాడ
వా; మహాదేవ మా నమోవాకములను
గొనుము మా వాంఛలను సను గూర్పుమయ్య.

పర- మంచిది విశదీకరింపుము,

శూర- దయాకరా సర్వసాక్షివగు నీకు మాయభిప్రాయ
ములు గూడ దెలుపవలెనా ఎంతవింత

పర- ఐన నిట్లగుగాక ఆధివ్యాధులంటని శరీరములతో అప
జయమెఱుంగని పరాక్రమములతో అపమృత్యుభయం
బెరుగని జీవితమున వెయ్యెన్ని యెనిమిది బ్రహ్మాంత
మాలకు నూటయెనిమిది మహాయుగములు సర్వస్వ
తంత్రుడవగు నియంతవై పరిపాలించి చివరకొక్క
నా శక్తిచేని హతుండవై మత్సాయుజ్యమందుదువు
గాక —సంతోషమైనదా.

శూర- ధన్యోస్మి ధన్యోస్మి

— గేయము --

ప. కరుణా వరుణాలయదేవా- యురగభూషణా. సదాశివా
మాకష్టంబులబాపి యసమాన- స్థానపదవి మాకొసగినాడవా
నీయాజ్ఞా పరిపాలనమునమము- నిగడజేయుమా నగగూర్పకుమా
మాయజ్ఞానమడంగ జేయుమా- మము నీదాసుల రీతిగాంచుమా ॥క॥

పర- తథాస్తు—తథాస్తు—[అదృశ్యుడగును.]

శూర- సోదరులారా!

చ॥ గురుకరుణాతిరేకమున గూర్చె పరాత్పరుడెల్ల సంపదల్
స్థిరమతి వీనిపాలనము జేయుట భావ్యముగాన మీరలె
ల్లరును సమానబాధ్యత మెలంగుట శ్రేయమటంచు నెంచి, ము
ష్కరులగు దేవతాధముల గాచియ పెట్టుడు నిశ్చయాత్ములై॥

[శుక్రాచార్యులు ప్రవేశించి]

శుక్రా- జయము జయము దానవ సార్వభౌములకు.

శూరాదులు- నమోస్తు గురురాయా (నమస్కరింతురు)

శుక్రా- నేడుగదా మా శిష్యపరమాణువుల మహదౌన్నత్య

మును కనులార గాంచు భాగ్యము లభించినది.

శూర- ఆచార్యా ఇదంతయు మీదయావిశేషమేగదా ఇక మీశిష్యులకేమి యాజ్ఞాపించెదరో సెలవిండు.

శుక్రా- ఎన్నేండ్లనుండి మీరు నేనొనర్చు తపస్సు నేటికిగదా ఫలించినది ఇక మీ కర్తవ్యమును గమనింపుడు,

తే॥ గీ॥ మొదట దిక్పతులను గెల్చి పిదప వారి
పదవులందున మీ ప్రతి నిధులనిల్పి
సర్వలోకంబులు నిరంకుశముగ పాలి
నంబొనర్పుడు శాశ్వతానందులగుచు॥

మఱచితి విశ్వకర్మను రావించి అద్వితీయంబులగు పురంబులు నిర్మింపుడు తరువాత పట్టాభిషేక సంభారంబు నెల్ల సమకూర్చిన నేనరుదెంచి మిమ్మభిషేకించెద

(పోవును)

శూర- తమ్ములారా గుర్వాజ్ఞానువర్తులై భవిష్యత్కృత్యముల నప్రమత్తులై యొనరింపుడు.

అందరు- చిత్తము

—తెరబడును—

శ్రీమత్ ములుగు సుబ్రహ్మణ్యారాధ్య విరచితం
కుమార విజయ నాటకం
ప్రథమాంకం సమాప్తం—

# ద్వితీయాంకము

— ఆశ్రమమున శిష్యసమేతుఁడై దూర్వాసుఁడు ప్రవేశించును—

దూర్వా- అక్కటా ప్రపంచమున కెంత విపత్తు చేకూరినది- సరే ఆవిషయమంతయు త్వరగా సాంగోపాంగ మెఱిగింపుము,

శిష్యు- మహాత్మా సావధానులుగండు.

తే॥ గీ॥ మాయయందునఁ గశ్యపమౌనివలన
శూరపద్మాదులను, రాక్షసులు, జనించి
లోకములనెల్ల నల్ల కల్లోలములుగ
జేయుచుండిరి నిర్దయ చిత్తులగుచు॥

తే॥ గీ॥ వారితోఁబుట్టువౌ యజవక్త్రియనెడి
కులట లజ్జావిహీనయై కులపతులను
తనివిలి వేధించి, పాపకృత్యముల నొప్పి
ఇచ్చవచ్చినరీతి, చరించుచుండు॥

తత్కారణమున ఆశ్రమవాసులగు మహర్షులు నైతము భీతచేతస్కులై ప్రవాసులగు చున్నారట,

దూర్వా— వారికీ శక్తి సామర్థ్యములెట్లులవడెనో

శిష్యు- వీరయాగమున పరమేశ్వరానుగ్రహము నొందిరట

దూర్వా- నివాసము పాతాళలోకమందేగదా!

శిష్యు- కాదు విశ్వకర్మచే భూలోకమున వీరమాహేంద్ర పట్టణము నిర్మించి అందభిషిక్తులైరట,

దూర్వా- స్వర్గమాక్రమింపలేదా,

శిష్య- ఊరకుందురా దిక్పతుల నెల్ల జయించి స్వర్గాదులందు దైత్యుల నధికారమున నియమించిరట తరువాత నా తని చిన్నతమ్ముఁడగు తారకాసురుఁడు, వైకుంఠమున కేగి మాధవునితో వేయేండ్లు పోరాడి నిర్జించి యాతని చే గౌరవమంది వెడలిపోయెనట,

దూర్వా- ఇక ఛాందసుఁడగు బ్రహ్మదేవునిగతి జెప్పట కేమున్నది?

శిష్య- మొదలనే ప ర మే ష్ఠి సామమున ప్రసన్నులఁజేసి కొనెనట,

దూర్వా- ఇది మంచియుపాయమే శైవులగుట శివు నతిక్ర మింపరు (శిష్యునితో) సరే కానున్నది కాకమాన దు. మీరేగి, పత్రపుష్పాదులఁదెండు,

శిష్య- (పోదురు)

దూర్వా- ఇదంతయు దక్షాధ్వరమునఁగలిగిన శివాపచారమే ఈశ్వరేచ్ఛ మనమేమి చేయఁగలము— పరా త్పరా భక్తపరతంత్రుఁడవగు నిన్నే నమ్మినవారికె ప్పటికిని కష్టములరానీకుము.

చ॥ అనవరతంబు నీపదపయోర్చన చెప్పెడి భక్తకోటి నే
యనువున నైన బ్రోచెదవటంచు నెఱింగినవాఁడనౌటనిన్
మనమున నిల్పి గొల్చెద ప్రమాదములెవ్వియు జేరకుండఁగా
ననుదయఁజూడుమా భవవిదాశ భయాపహ చిత్తు నిత్తరిన్

నేఁడు. నా మనమాందోళనము జెందుటకు కార

గాముదోపదు. భగవాన్ సర్వభారములు నీ
యందే యుంచితి (లోనికేగును)

—అజవక్త్రి సఖులతో ప్రవేశించును—

అజ- హేవళంబీ యిది యొక మున్యాశ్రమమువలెనున్నది.
ఇందెవరు గనపడరేమి?

హేవ- ఆశ్రమలలములు దెచ్చుకొనుటకేగి యుందురు.

విళం- అంతే అమ్మా అంతే

అజ- అయితే మనమిక్కడెంతకాలముండవలెనో?

హేవ- ఇక్కడేనుండమ్మా బూడిద

విళం- ఎటుజూచినా ఒక్క మొగపురుషుడైనా కనుపించడే

హేవ- మనపేరుజెపితే మొగవాళ్లామడ దూరంలో వుండ
వలసిందే,

విళం- నీ మొగం నీ మోర కడవంత గుమ్మడికాయైనా కత్తి
పీటకు లోకువేగా

అజ- ఏడ్నావు చచ్చుముండ,

విళం- నేనేమన్నానమ్మా.

అజ- పోచికోలు కబుర్లుచెప్తూ కూరుచున్నావా త్వరగా
వెళ్లి ఆ పాకలో నెవ్వరైనా యున్నారేమో
చూచిరా!

విళం- (పోవును)

హేవ- అమ్మా ఆపాకజోలి మనకెందుకు?

అజ- అదేమిటే ఆలోపల యెవరైన నొకమహర్షి తప్పకుంటాడు,

హేంప- వాళ్లసలే కోపిష్టి సన్యాసులు వాళ్లతో మనకు పనేముంది?

అజ- సరే వారితో పనిలేదా చాల తెలివికలదానవు,

విశం- (ప్రవేశించి) అమ్మా లోపలనెవరో యొకముసలాయన కండ్లుమూసికొని కూరుచున్నాడు

అజ. మంచిది మీరు వెళ్లి కూతవేటు దూరములోనుండుడు

(చెలులు పోదురు)

అజ- ( ద్వారముచెంతకేగి లోనికిజూచి ) ఓహో యీయన దూర్వాసమహర్షియా, ఇతడు చాలముక్కోపి యని విందును, సమాధియందున్నాడుగాబోలు—ఇపుడేమి చేయవలయు (యోచించి) ఎటువంటివారును గానపరవశులగుదురు గదా.

## —గేయము—

తపోధనా తపోధనా దయానిధానా తపోధనా.
అపారయోగానందానుభవా సంజీవనా పరమపావనా ॥త॥
నీకరుణామృతవృష్టి నాపైని నెఱపి నావాంఛ నీడేర్పుమా
లేక లేక నీదర్శనము బ్బెను లేమిలేమిగా జేసి బ్రోవుమా ॥త॥

దూర్వా- (ప్రవేశించి) ఎవ్వరీమె [ప్ర] వనితా ఎవ్వరిదానవు? యెందుకిచటికి వచ్చితివి?

అజ- స్వామీ మీదాసనే మీకొఱకేవచ్చితిని.

దూర్వా- ఇదేమి విపర్యాసము. నీపుట్టు పూర్వోత్తరముల
దెల్పుము.

అజ- నేనొక మహర్షి పుత్రిని- తమదయ నాసించితిని.

దూర్వా- నీవు ఋషికన్యవా

అజ అవును! కశ్యపుని కూతురను.

దూర్వా- తల్లి పేరేమి,

అజ- మాయాదేవి

దూర్వా- శూరపద్మాసురుని చెల్లెలవా?

అజ- అవును ప్రభూ

దూర్వా- (స్వ) హతోస్మి, హతోస్మి అనుకున్నంత జరిగినది.
(ప్ర) మంచిది నీరాకకు కారణమెఱిగింతువా?

అజ- చల్లకువచ్చి ముంతదాతునా సంతానార్థినై వచ్చితిని

దూర్వా- (రిచ్చపడి) నేను భగవంతుడను కానుగదా

అజ- అట్లనుట తగదు తమరు సర్వతంత్ర స్వతంత్రులు।

దూర్వా- కాదు! నేనొకతపస్విని.

అజ- తపోశక్తికి మించినదికలదా.

దూర్వా- [స్వ] ఇదెక్కడిఘోరము నీకోర్కె నెఱవేర్చు
టకు నేనశక్తుండను,

అజ- ఎంతమాట,

దూర్వా- నిజమే నామాటనమ్ముము,

అజ- నన్నుమీరు వంచించు చున్నారా?

దూర్వా- అట్లైనట్టికిని తలంపేకుము నేను పరవంచకుడను గాను.

అజ- కావనియే మిమ్ము ప్రార్థించుట

దూర్వా- ఐననిక పొమ్ము మాకనుష్ఠానసమయమైనది.

అజ- నాథా నేనును త్వరపడుచునే యుంటిని.

దూర్వా- నాథా అదేమి అదేమి

అజ- (సమీపించి) నాకు సంతానవాంఛ పదలుట లేదు!

దూర్వా- [కృ] దైవమా నా కెట్టి విపత్తు చేకూర్చితివి [యోజించి] తపోవ్యయమునకు వెఱచిన ప్రమాదము తప్పదు [ప్ర] తరుణీ యీశ్వరానుగ్రహమున పుత్రవతివయ్యెదవుగాక.

అజ- నాకు, మీకన్న యీశ్వరుడొకడు కలడా ఇతరుల యనుగ్రము గోరునంతటి బేలనైన మిమ్మేల యాచింతును అలసింపకుడు,

దూర్వా- నీవాంఛ సఫలమగునింక పొమ్ము.

అజ- అయ్యో ఇట్లందురేమి సంగీతమునకు చింతకాయలు రాలునయ్యా,

దూర్వా- నీయభిప్రాయము నాకు తెలియుటలేదు.

అజ- మీకు తెలియునే తెలియదా భర్తలేక సంతానమెట్లు కలుగునో సెలవిచ్చెదరా!

దూర్వా- ఓహో నీవవి నాహితవా,

అజ- నిజము నేనింతవఱకెవ్వరిని పెండ్లాడలేదు,

దూర్వా- అయిన నీ కచిరకాలమున తగినపురుషు లభింప గలడు.

అజ- మీకన్న యోగ్యుడెవడు?

దూర్వా- ఏమి యీయపభ్రంశ సంభాషణము.

అజ- నన్నిక నెంతకాలము వేధించెదవు ఆలస్యమింక సహింపను. (పట్టుకొనబోవును)

దూర్వా- (దూరమేగి) పాపము శాంతించుగాక ఛీఛీ దుర్మార్గురాలా [లోనికేగును]

అజ- ఈపాపము మాటలతో శాంతించునదికాదు నేనును వచ్చుచునే యుంటిని. [లోనికేగును తెరబడును]

## రెండవరంగము.

—ఆశ్రమసమీపమున చెట్టుక్రింద హేవళంబి విళంబియు కూర్చుందురు—

హేవ- ఎంతకాలమే మనకీ వనవాసము?

విళం- ఆ దేవిగారు దయచేయునంతవఱకు

హేవ- పోనీగాని యీమె యీరుషుల వెంటబడినదేమి?

విళం- వీళ్ళవలన, మంచి సంతానం గలుగుతుందని యాశ.

హేవ- ఇది దురాశయే!

విళం- మహర్షులు సర్వసమర్థులట

హేవ- పిచ్చిమొగమా వారువిరాగులు వీరివలలో బడుదురా.

విళం- బలవంతముచేతనైనను సాధించితీరగలదు.

హేమ- వారు మునిపుంగవులు యెప్పుడో యీ మునిపట్టగలరు.
విశం- గోడలకు చెవులుంటవని మానకొందుకులే యీసంభాషణము
( పటాక్షేపమున మునికుమారుఁడు ప్రవేశించును )
హేమ- ఒసే యెవరో, వొకచక్కనాయన ఇటు వస్తున్నా డుగాని ఆయన్ను నిలవెయ్యి కొంచెము తమాషా చేద్దాము.
విశం- మునికుమారుని మోస్తరున్నాడే ఆయన జోలినీకెం దుకు యేమన్నా కోపంవచ్చి శపించాడా అంటే మన రోగం కుదురుతుంది,
హేమ- ప్రతివారు శాపాలిచ్చేవారేనా? [యెదురేగి] ఏమం డోయి యెవరుమీరు?
శిష్యు- నేనువిద్యార్థిని
హేమ- ఏమిచదువుచున్నావు యెంతకాలమునుండి యెవరి దగ్గఱ?
శిష్యు- ఈసమీపాశ్రమమునగల దూర్వాసమహర్షి శుశ్రూష చేయుచుంటిని.
హేమ- ఇపుడు చదివేదేమిటో చెప్పవేం?
శిష్యు- వేదము,
హేమ- ఏ వేదము?
శిష్యు- యజుర్వేదము,
హేమ- ఇపుడీ వేదమేనటయ్యా చదివేది,
శిష్యు- మాగురువుగారిదే చెప్తున్నారు.

హేవ. మీా గురువుగారికి మతిపోయినట్టుంది యీా తరుణంలో
యిదేనా చెప్పడం?

శిష్యు- మాగురువుగారు చాలాసమర్థులు ఆయనగతంటె నీకేక్షవ తెలుసునా యేమిటి?

హేవ. తెలుసునో తెలియదో నీకు తెలుసుకోవలెనను కుతూహలముంటే తర్వాతమాట చెప్తా,
పోనీ నీతో నాకు వివాదమెందుకు, నీవే గొప్ప విద్వాంసురాలివి,

హేవ- అవునో కాదో అనుభవంమీాద కాని తెలియదు, నీకిప్పుడు వయస్సెంత?

శిష్యు- పదియారేండ్లు,

హేవ- మరి యీా యీాడులో యిదేనా నేర్చుకొనేది. యేమయ్యా నీ తెలివి,

శిష్యు- ఏమోనీమాటలు నాకర్థంగావడంలేదు,

హేవ. ఇంకా అర్థంకావడంలేదయ్యా?

శిష్యు. కాలేదు.

హేవ..అయితే యిప్పుడు మాబోటిగురువులుగాని మీాకు నేర్పలేరు?

శిష్యు- సరే బాగానేయున్నది. [పోబోవును]

విశం- (అడ్డగించి) ఎక్కడికిపోతావయ్యా మాఅక్కయ్య నేర్పుతానంటే?

శిష్యు- అమ్మా మీచదువు నాకక్కర్లేదు (పోబోవును)
విశం- (చెయ్యిబట్టుకొని) నాచదువెంతబాగుంటుందో నీకేం తెలుస్తుంది?
శిష్యు- ఛీఛీ నీచురాలా బ్రహ్మచారిని వన్నంటుకొనెదవా [చేయివిదల్చుకొని]

(దూర్వాసుని వెంటాడుచు వాతాపీల్వలులు ప్రవేశింతురు)

వాతా- మీతపశ్శక్తి మాకిడినగాని మిమ్ము వదలము
ఇల్వ- బ్రతుకదలచిన ఆపనిచేయవలసినదే
దూర్వా- పితృహత్యా పాతకమునకొడిగట్టెదరా?
వాతా- మాకు పాపపుణ్యములతోబనేమి?
ఇల్వ- కనుక మా మాట వినకతప్పదు?
దూర్వా-(కోపముతో; అటులైన తాపసాపచారమున నేనశింతురుగాక [నిష్క్రి]
అజ- అయ్యయ్యో
వాతా-ఏమమ్మా!
అజ, ఏమిచేయుచుంటిరి?
ఇల్వ- ఈయన తనతపశ్శక్తి మాకీయరట
అజ- తప్పు నోట్లనుగగూడదు,
వాతా- ఇవుడేమిచేయుమనెదవు
అజ- మన కులగురుడగు శుక్రాచార్యునికడకేగి కర్తవ్యమెరుంగుడు.
వాతా- సరేమంచిది. (తెరబడును)

## మహాడవరంగము.

—వింధ్యారణ్యమున నొకకటీరముకడ వాతాపీల్వలులుందురు—

ఇల్వ- అన్నా మనమతికష్టమున బరమేష్ఠిని బ్రసన్నులజేసి కొనియు. కోరరాని కోరిక గోరితిమి.

వాతా-ఇదేమిట్లనుచుంటివి?

ఇల్వ- నామనసేలనో నేను కీడును శంకించుచున్నది. మన మేనమామలగు శూరపద్మాదుల వైభవము గాంచితిమి గదా మనకేల యీబుద్ధి పుట్టవలయు.

వాతా-ఓరీ వెఱ్ఱివాడా ఇదియా నీయనుమానము ఈవరమ సామాన్యము దీని భావమెఱుంగుట కెవ్వరికిని శక్యము గాదు,

ఇల్వ- ఏమోనీమాటలు నాకర్థమగుటలేదు, ఇంతవఱకనేక మహర్షుల భక్షించితిమిగదా మనకేమి సౌభాగ్యము చేకూరినది.

వాతా-అయిన నినొక్కటడిగెదను, సమాధానమిత్తువా

ఇల్వ- నిస్సంశయముగా,

వాతా-ఈ యమరుల భోగభాగ్యములకెవ్వరు కారకులు,

ఇల్వ- స్వయంకృషియేకదా?

వాతా-పొరపాటు ఈమహర్షులిచ్చు హవిర్భాగము లే వీరి కింతయౌన్నత్యము నొనగూర్చుచున్నవి-

ఇల్వ- కావచ్చును,

వాతా-కనుకనే నీరినిర్మాలనము, సమాప్తమైనచో వారు జీవచ్ఛవములగుదురు అప్పుడు నిర్భయముగా మన మాపదవుల నాక్రమించి సుఖింపవచ్చును,

ఇల్వ- నీయాలోచనము మంచిదేకాని ఇప్పుడా పదవు లన్నియు మనవారివేకదా?

వాతా-కొలదికాలమున నీరేదో మాయోపాయమున సంచిం పకమానరు,

ఇల్వ- ఆమాటనిజమే అగస్త్యాది మహాత్ముల మహిమావిశే షముల గోచరములు,

వాతా-కావున మనమీపని యందేతరింపవలయు [ఆలించి] అదిగో వినుము యేవో మాటలు వినబడుచున్నవి నీవేగి వారల నాహ్వానింపుము [పోవును]

ఇల్వ- ఈ కృత్యమెన్నటికైనను ప్రమాదమే [పోవును]

(లోపాముద్రాగస్త్యులు ప్రవేశింతురు)

లోపా-ఈయరణ్యమింత నిర్మానుష్యముగనున్నదేమి.

అగ- ఇది రాక్షసవిహారభూమి,

లోపా- అయినమనము త్వరపడుట మంచిదికాదా?

అగ- భయపడుచుంటివా?

లోపా-తమసన్నిధానమున భయమునకు తావెక్కడిది. అబ లాత్మగదా?

అగ- ఇదియొక క్రొత్తమాట విచారింపదగినదే,

లోపాటుమింపుడు,

అగ- నీవేమియుపరాధ మొనర్చితివని.

ఇల్వ- [ప్రవేశించి] మహాత్మా నమస్కారము.

అగ- నీవెవరవు?

ఇల్వ- నేనొక యోగసాధకుడను,

అగ- అయిన మావలనకాదగిన దేది?

ఇల్వ- నేడు మాతండ్రిగారి యాబ్ధికము మీరుభోక్తలుగ నుండవలయు.

అగ- శతంవిధాతుభోక్తవ్యం, మంచిది

ఇల్వ- దయచేయుడు-[అందరుపోవ నారదుడు ప్రవేశించును]

నార — గేయము —

పరాత్పరా భవసాగరతర నిరాకార నిశ్చలానందకర||

దురితవిదూరా దుఃఖనివారా స్మరసంహారా సాకారా ||పరా||

ఆహా ఇప్పటికి గదా లోకమునకు కొంతశాంతి చేకూరినది, పరమపాపిష్ఠులగు వీరివలన నెందరో మహాత్ములు కాలధర్మమొందిరి

ఉ|| దురహంకార పరీతచిత్తుడగు విధ్యుండజ్ఞుడై మేరు భూధరమున్ వంచనజేయ కెంచి పెరిగెన్ దారాపథంబంటు; న త్తరి యీ కుంభవుండె వాని మదమంతంబొంద భూగర్భమున్ దొరగన్ జేసి చరాచరంబులకు సంతోషంబు గూర్చెన్ గదా.

యీ మహర్షి మహాత్వమెరుంగక యీ దురాత్ములు సామాన్య మానవునిగా భావించి హతులైరి, అత్యుత్కటైః పుణ్యపాపైరిహైవ ఫలమశ్నుతే

( లోపాముద్రాగస్త్యులు ప్రవేశింతురు )

నార- అగస్త్యమహర్షి స్వాగతము.

అగ- దేవముని ఇచట ప్రత్యక్షమైతివేమి.

నార:- గీ॥ ఎఱుఁగుదునుమున్ను వింధ్యాచ లేంద్ర దమను
చూచితిని సప్తసాగరా పోశనచణు
ఇపుడు మనసయ్యె జూడగా నిల్వలారి
గాన నీ శాలలో దిరుగంగ వలసె.

లోపా- [చకితయగును]

అగ- అదేమట్లను చున్నావు.

లోపా- వారు మాకన్నదాతలు.

నార- సాధ్వీమతల్లీ వారన్నదాతలేకాదు, ప్రాణఘాతుకులు నేడు నీభర్త కరుణా విశేషమున నెందరో సాధువులు రక్షింపబడిరి.

లోపా- (భర్తతో) అదేమి,

అగ- ఏమో—

నార- ఎంతటి గడుసువాడవయ్యా! అమ్మా నేనే జెప్పెద వినుము.

గీ॥ అన్న మిడినట్టివానికి సున్నమిడిన
సరణి రక్కసులిడిన మాంసంబు మెక్కి
సొలగి జీర్ణము వాతాపి జీర్ణమనుచు
బ్రేవుమని త్రేపె నీమనో ప్రియుడితండు.

లోపా- పాపము శాంతించుగాక.

నార- సాధ్వీమణీ నీవచన మమోఘము, యీ మహాత్ముని యనుగ్రహమువలన కొంతపాపము శాంతించినది.

లోపా- వీరలతిథిపూజాపరులవలె గన్పడినారు.

నార- ఈ వనమున నే పెక్కురు ఋషుల బరిమార్చినారు.

లోపా- వీరికీ సామర్థ్య మెట్లుపచ్చినది.

నార- పరమేష్ఠి యనుగ్రహమున,

లోపా- ఆ యనఘుడిట్లు మునుల బరిమార్చుమని యాదేశించినాడా?

నార- కాదమ్మా, అతడొసంగిన వరప్రభావమున వీరలీ పనికి దొడంగిరి,

లోపా-ఏమి యీవింత.

నార- వీరలాతని తపమున మెప్పింప విధాత ప్రత్యక్షమై వరంబు వేడుమన స్వామీ మా యిరువురలో నొకని వధియించి మరల యాహ్వానించినంతనే బ్రతుకునట్లు వరంబొసంగుమన తథాస్తని యతండు చనియె అదాది వీరలాబ్దిక వనమున మహర్షుల నాహ్వానించి యొకని వధియించి తన్మాంసమున భోక్తల దృప్తి బఱచి సాగనంపి వారు కొంతదవ్వరుగ సోదరాయని పిలిచిన నతండు సజీవుండై యుదరము జీల్చికొని వెలి కేతెంచిన నా విప్రుండు మడయ నాతని శవంబును వీరారగింతురట. అట్లులే నేడు మిమ్మాహ్వానించి భోక్తయగు నీ భర్తను దృప్తి పఱచిరి.

లోపా- ఎంత యాశ్చర్యము తరువాతకథ నేనెరింగినదే.
నార- అయిన నాకథ నేనెరుంగ కూడదా.
లోపా- అదేమి వినుము భోజనానంతరము మేమిరువు
రము మము వచ్చుచుండ ఈమహర్షి యొక్కింత శ్రమనభిన
యించి జీర్ణంజీర్ణం వాతాపి జీర్ణమని బొజ్జనిమురుకొని
పయనము సాగించె అపుడు నేనడిగిన కొంచెము దర
బాధ గలిగెనని వచించె. ఇంతలో మీదర్శన భాగ్య
మున యావద్వృత్తాంత మెఱింగితిని.

( త్వరితముగా ఇల్వలుడు బ్రవేశించి )

ఇల్వ- ఓరీ అంతక బ్రాహ్మణాధమా నాతమ్ముని పొట్టనిడి
కొంటివా, ఇదిగో యిప్పుడు నీగతిజూచికొమ్ము, [పై
కెఱుకును]
నార- (అడ్డుపడి) ఓరీ విప్రవెంగళప్పా ఏమి ఈమూర్ఖము,
నీసోదరునిగతి నెఱింగియు తొందర పడుచుంటివేమి.
శాంతింపుము.
ఇల్వ- ఏమి యింకను శాంతమా పిలిచినంతనే పరువెత్తుకొని
వచ్చు నాసోదరుడు రాకున్న నే నూఱకుందునా.
నార- నీసోదరుడు కనుబడకున్న ఇయ్యనఘుని బాధించుట
న్యాయమా,
ఇల్వ- ఈతని పొట్టచీల్చిన నాతమ్ముడుండు జీవింపగలడు.
నార- జీర్ణించిన పదార్థమున జీవముండునా?
ఇల్వ- అయిన మరణించినాడా

నార- మరణించెనో లేదో నేనెఱుగనుగాని జీర్ణించుటమాత్రము తథ్యము.

ఇల్వ- ఆహా, హతోస్మి హతోస్మి

అగ- తథాస్తు తథాస్తు

ఇల్వ- (ఇల్వలుడు మరణించును)

నార- కల్యాణంభూయాత్.

—తెఱబడును—

# నాల్గవరంగము.

—అరణ్యమున శచీంద్రులు నారదునితో సంభాషించుచుందురు—

నార- మహేంద్రా కాలమెప్పుడును నొకేతీరున నుండదు ప్రారాబ్ధమనుభవింపకతప్పదు, భక్తునకు భగవత్సహాయముండకపోదు,

దేవేం-మహర్షీ ఎన్నివిధముల బ్రయత్నించినను మనమునకూరట జనింపదు పూర్వమెందరురాక్షసులు స్వర్గము నాక్రమింపరు ఇంతటి క్రూరాతి క్రూరులనెప్పుడును జూడము, ఎన్నెన్ని నీచకృత్యముల నియోగించినను మాఱుమాటాడక వినయవిధేయులమై అడుగడుగులకుమడుగులొత్తుచున్నను లేశమాత్రమైనను క్షమింపకపోవుటయేగాక, ఆభిజాత్యమునుగూడ చెఱుపనెంచినాడు ఇంకేమిచేయుటకును దోపక ఈయజ్ఞాతవాసమున గృశింపుచుంటిమి, దీనికపసామేతోపదు, యింకె

న్నినాల్లీ యిడుమలొందవలెనో, విధివిధాన మేమో
దైవమున కేయెఱుక.

నార- దేవనాథా ఆధైర్యమునువీడి కార్యోన్ముఖుడవగుము.

దేవేం- భవిష్యన్మార్గ మంధకార బంధురము.

నార- నిరాశ నొందకుము పరమేశ్వర సేవయే దీనికి తరు
ణోపాయము కావున నమరులంగూడి కైలాసమున
కేగి యావద్వృత్తాంత మాతనికి నివేదింపుము. నీకు
శుభము చేకూరగలదు,

దేవేం- [శచినిజూచి] ఈమె నిటనుంచి పోవలయు,

నార- [యోజించి] మఱచితి శాస్తాభైరవ సంరక్షణమున
నీమెకేయాపదయు వాటిల్లదు.

దేవేం- స్వామీ ఆతడెవరు,

నార- పూర్వకాలమున సముద్రమును మధింప నందమృతము
ద్భవించె. దానికొఱకు సురాసురులు కలహింప తన్ని
వారణార్థమచ్యుతుండు మోహినీ రూపమున నట
కరుదేర శివుండామెనీరమింప ప్రశస్త ప్రభావుండగు
నీ శాస్తాభైరవుండు జన్మించె ఆతని యనుగ్రహము
నీకానందదాయకము కాగలదు. కాన నీవతని ధ్యా
నింపుము.

దేవేం- చిత్తము (ధ్యానించును)

(శాస్తా భైరవుడు ప్రవేశించును)

దేవేం- శివకేశవాత్మజా అభివందనము దీనాతిదీనుడ నయిన నన్ననుగ్రహింపుము.

శాస్తా- దేవనాథా ఈదైన్యము నకు కారణమేమి.

దేవేం- స్వామీ అగతానాగత వేదులగు మీకు నేనేమి చెప్పగలను.

శాస్త్ర- విచారింపకుము. పరమేశ్వరుడు ప్రసన్నుడై నిన్నాదరింపగలడు, నా సంరక్షణమున శచీదేవి సురక్షితయగును. నీవు శీఘ్రముగా కైలాసమునకేగుము.

నార- దేవేంద్రా ఇంక నాలసింపకుము.

దేవేం- చిత్తము సెలవిత్తురా.

శాస్త్ర- శుభంబగుగాక వెళ్ళుము.

దేవేం- దేవీ అదృష్టవశమున నీ మహానుభావుని యండవొంకినది. నిర్భయముగా కాలము గడుపుము, నేనచిర కాలముననే తిరిగి రాగలను. [పోవును]

శాస్త్ర- దేవరాణీ నిశ్చింతతో నుండుము. నేనీసమీపముననే నిస్సరయి యుందును. (మహాకాళునితో) మహాకాళా అప్రమత్తుడవై ఈ శచీదేవిని రక్షించుచుండుము.

(పోవును)

శచీ- చిత్తము [తలవంచి విచారమున] దైవమా, మాకెన్ని యిడుములసమకూర్చితివి. ఎంతకాలమీ ప్రవాసమున నొంటిగా కుంగి కృశింపవలయు,

చ॥ అనయము మూఁడుకోట్ల దితిజారులుఁ గొల్వ దిగీశులెల్లఁ గన్
మనము నెఱింగి సేవల సమానముగా నొనరింప నప్సరో
వనితల నాట్యముల్ గనుచు స్వర్గము నేలు మహేంద్రుఁ డొంటిరై
వనమున నుండె నేమనఁగవచ్చు పురాకృత భాగధేయముల్.

పరమ పాతకుండగు శూంపద్మాసురుండింత క్రూరత్వము దాల్చినను సహించి యెట్టి నీచకృత్యముల నియోగించినను మారుమాటాడక జేయుచుండెఁగదా. ఇంక వీనికీదుర్బుద్ధి జనింపనేల అష్టైశ్వర్యములనుభవించి సుఖించు నాయమరేంద్రుఁడు నాకతమున నేఁగదా యిట్టిపడరానిపాట్లు పడవలసి వచ్చినది. ఓ దేవుఁడా నన్నేల సృజించితివి. సర్వదా పతికి హితమాచరించునదియే గదా, సతియను సార్థకనామము వహించు, నావంటి యభాగ్యవతికి భర్తయగుటనే కదా నీమహాభాగునకీ దురవస్థ ప్రాప్తించినది. ఎందరెందర సౌందర్యవతులనో స్వాధీనల నొనర్చి సమస్తభోగములందు నీరాక్షసాధముని దృష్టి నాపై నేల ప్రసరింపవలయు. నేనొక సంతానవతినగు కులాంగననని యైన భావింపడే ఓ దురదృష్టమా నీప్రతిభావిశేషములద్వితీయములు. నీసామర్థ్య మమోఘము. నీ బారింబడిన వారెవ్వడైనను జీవచ్ఛవమగునుగదా. జయంతా ఏకైక పుత్రుడవగు నిన్నుజూచు భాగ్యమిక లేదు గాబోలు.

చ॥ మణిమయ ధర్మహర్మ్యముల మాట దలంపను భోగభాగ్యముల్
గణన మొనర్పగాని నిను కన్నులగాంచుచు నేకపుత్రి వీ.
క్షణమున సంతసింపగల కాలము వచ్చునో రాదో యంచు నే
క్షణమునసైన కుందెదనిశంబు జయంత దురంతచింతచేన్.

(మూర్ఛిల్లును)

— సఖీ సమేతయై అజవక్త్రి ప్రవేశించును —

హేమ- అమ్మా నిన్న మనమీయరణ్యమంతయు దిరుగాడిన పుడొక్క పచ్చిచెట్టైనను గనుపడకుండె నేడన్నియు జిగుర్చి నవనవలాడుచున్న వేమమ్మా?

విశం- వెర్రిమొగమా ఇటుచూడుము ఈవృక్షములకే యింత విస్మయమొందుచుంటివి నిరాటంకముగా బ్రవహించు నీనదిఁ గాంచిన నెంత బెదరుదువో,

హేమ- అమ్మా చూచితివా యీ ప్రవాహమెంత గంభీరముగానున్నదో,

అజ- ఓసీ ఈప్రవాహమున్గనిన నాహృదయము బ్రద్దలగుచున్నది మరొండువైపునకు పోవుదము పద,

విశం- అదేమమ్మా అట్లనుచుంటివి,

అజ- నీవే మెరుంగుదువు [illegible]పుత్రుల మ్రింగిన దురాత్ముడగు అగస్త్యుడే యీనదిన్దెచ్చినాడు,

విశం- అటులనా అయిన దీని మొగము చూడరాదు,

హేమ- నీమొగము — మనకపకారియైనను ప్రపంచమునకుపకారమొనర్చినాడు— అమ్మా దీనిందెచ్చుటకు కారణమేమైయుండునో?

అజ- మాపెద్దన్నయగు శూరుడొకనాడు ఇంద్రాణిం
గాంచి మోహించి నాపెన్దోడ్తెచ్చుటకు బ్రయత్నించ
నాసంగతి యింద్రుడెఱింగి భార్యాసమేతుడై ఈవన
మున వేఱురూపమున బ్రచ్ఛన్న జీవితము గడుపు
చుండె. నీదేశమున వర్షాభావమై క్షామమరుదెంచిన
నింద్రప్రసన్నుడగు గణేశునివలన అగస్త్యుని కమండ
లువునందున్న యీనది భూమిబ్రవహించెనట ఆకార
ణమున క్షామ మడుగంటి ఈవనమింత శోభావహ
మైనది.

విశం- ఓహో ఇదియా కారణము,

అజ- ఏకారణమైనను మనకేమిగాని, యీయరణ్యమును
గాలించినచో మహేంద్రుని వర్తమాన మెఱుంగ
వచ్చును.

హేవ- మంచిది తమచిత్తము [ముందుకుజూచి] అమ్మా ఇటు
చూడు మిటుచూడుము.

విశం- ఎక్కడనే.

అజ- ఆహా ఏమి లావణ్యా మెవరీపె.

హేవ- అమ్మా ఈపె సామాన్య వనితగాదు,

అజ- నాకు నటులే తోచుచున్నది బాగుగా పరికించినగాని
తెలియునట్లులేదు.

చ॥ విమలకృశాంగియై విడినవేసవి భూమిని దొర్లుచుండగా
నమిత విశార భారమున నచ్చోట మూర్ఛమునింగి యుండె యీ

యమయటులొంటినైని విపినమందు వసించుటకేమి హేతువో
క్రమముగ నాకుచే తెలియగ పలె సుమ్మతతీయవృత్తమున్||

హేవ— అవశ్యమటు జేయవలసినదే,

శచీ— (జయంతకుమారాయుని కలుపరించును)

విశం— దేవీ- జయంత కుమారుడెవడు?

శచీ— (అయ్యో స్వర్గమా అనును)

అజ— ఆడబోయినతీర్థ మెదురువచ్చినట్లు ఈపె వనాయాసముగా గనుగొంటిమి

హేవ— ఎవరమ్మాయీమె?

అజ— ఇంతతపడుచు మనమెవరికొఱకు యీవనమంతయు గాలించుచుంటిమో— ఆమెయే యీసుందరి,

విశం— మహేంద్రుని భార్యయా,

అజ— అవును.

హేవ— బాగుబాగు వెదుకబోయినతీగె కాలికితగిలినది,

అజ— యెందులకాలస్యము, ఈపెను మేల్కొల్పుము

శచీ— (లేచి కన్నులు నులిమికొనుచుచూచి భయమున) అమ్మా మీరెవరు?

విశం— మేము తమయన్వేషణ కార్యమున వర్తించు సార్వభౌముని దూతికలము (అజవక్త్రివిజూసి, తత్సోదరికి ప్రాణసఖులము.

శచీ— చచ్చితి చచ్చితి (మూర్ఛిల్లును)

అజ— చూచెదరేమే,

హేమ- అమ్మా అంతతొందరెందుకు మేల్కొనినతరువాత నే యోజింతము.

అజ- ఆయాటలన్నియు నీ పెకడసాగవు,

విశ్రం- సాగనీయక నశక్తురాలను నీ పెయేమిచేయగలదు,

అజ- గోళ్లబోవుదానికి గొడ్డలెందుకు ఊ—ఎత్తుకొనుడు,

శచీ- (మేల్కొని) అమ్మా యీమెమహారాజ సోదరియా దేవీ కరుణామయీ నమస్కారము దీనురాలను నన్ను రక్షించుభారము నీయందున్నది,

అజ- దేవిని నేనుకాను నీయందకారణమున జనియించిన కరుణచేత నే విన్ను దేవేరిని జేయదలంచితిని కావున లెమ్ము పోవుదము,

శచీ- హా తా నాథ ర్తయరుదెంచు వఱకిచట నేయుందును,

అజ- అతడింకెక్కడికివచ్చును వచ్చిన నెట్లు బ్రదుకును ఆతని యాశనింక వదలిన నీవు సర్వసౌఖ్యమనుభవింపగలవు అనేక బ్రహ్మాండములకధిపతియగు నాయగ్రజుడు నిన్ను త్రికరణశుద్ధిగా ప్రేమించుట నీ వెఱుంగుదువు గదా ఇంక నేల సంకోచించెదవు,

శచీ- శివశివా ఎంతమాటాడితివమ్మా, నేనుపతివ్రతను దేవేంద్రుని భార్యను,

అజ- ఆవిషయము నే నెఱుంగకున్న నిట్లు మాట్లాడుదునా,

ఉ॥ చక్కదనాలకిక్కయగు- జాణను తాళినిగట్టినట్టి వా
డొక్కడె భర్తయన్నపలు- కూహకుజాలిన యుక్తిగాదు కై

పెక్కైన పూరుషాఘములు- కిట్టిదురూహలు గల్గి వారలీ
చక్కని వాగుచుందురిది- స్వార్థమటంచు నెఱుంగుమంగనా॥

కావున సక్తనైనను తెలివిదెచ్చుకొని భవిష్యన్మార్గమా లోచించి సుఖించుము,

శచీ- (స్వ) ఈపెతో వివాదమపాయము (ప్ర) అమ్మా సర్వసమర్థురాలవగు నీవెట్లానర్చినను తగునుగాని నాబోటి పుత్రవతియగు నబలయేమిచేయగలదు?

అజ- అదిగో ఆదుర్బలభావ మెఱింగియే పురుషులు మనల నిట్లు వంచించుచున్నారు,

శచీ- క్షమింపుము విద్యావతివగునీతో నే మాట్లాడగలనా

అజ- నేనిన్ను క్షమించినను కాలము క్షమింపదు పుత్రవతినను చుంటివి, ఒకకాలమున నేనును సంతానవతినే అయినం తమాత్రమున నన్నియు విడిచి సన్యాసులమగుదుమా అదిదురూహా ఎంతవఱకాహారము నడుచునో అంత వఱకు విహారమాగదు పోనీ, నీవు సంతానవతివిగదా భర్తకై పరితపింతువేల ఈమాటకేమి సమాధాన మిత్తువు,

శచీ- చిత్తము,

అజ- చిత్తమన్యాయత్తము గాకుండ నుంచుటకెవరితరము కావున కష్టముల విసర్జించి కల్యాణమపేక్షింపుము.

శచీ- దేనికైనను విధిబలమేగదా కారణము.

అజ- ఇటువంటివిధు లెందఱైనను మాయన్నకాలి గోరున

కేన రారు,

శచీ- దైవసంకల్పము

అజ- మనసంకల్పము దృఢమైనచో దైవమేమిచేయగలదు కనుక నీవేమియు మారుమాటాడక బయలుదేరుము.

శచీ- ఎక్కడికి?

అజ- నీవెప్పుడు కనివిని యెఱుంగనంతటి సకలసంపత్సమృద్ధమై వేయిస్వర్గములకన్నను మిన్నయగు పిఠమహేంద్రపురికి,

శచీ- తల్లీ నేనెక్కడికిని రాదలచుకొనలేను.

అజ- ఎందువలన?

శచీ- చిరకాలానుభవముకైన భోగభాగ్యములయందు నాకు వైరాగ్యముగలిగినది.

అజ- ఈవిరాగము తాత్కాలికమని నేనెఱుంగుదును దీనినే ఆభావవిరక్తియందురు,

శచీ- కాదు నేనబద్ధమాడు దాననుగాను,

అజ- (కోపముతో) నీవికవృథావాగ్వివాదముల కాలయాపన మొనర్చిన నేసహింపను— ఈ వమందువు బలాత్కారమున గొనిపోవుట నీకంత గౌరవముగాదు నీకై నీవువచ్చినచో మనమిద్దరమును చాల గౌరవింపబడుదుము,

శచీ. (నిరుత్తరము)

అజ- [శచిని జుట్టుపట్టీడ్చును]

శచీ- చచ్చితి చచ్చితి హేభగవాన్,

మహాకాళుడు- [ప్రవేశించి] కులటా సాధ్వీశిరోమణివగు నీదేవరాణి నిట్లేడ్చుచుంటివేమి?

అజ- నీవెవడవురా నిర్భయముగా నన్నడుగుటకు దేవరాణియా అబ్బా జీవచ్ఛవమువలె ప్రచ్ఛన్నముగా జీవితశేషమున్గడుపు; నీ పెధ రక్తకింకను రాజరాణియా మారుమాటాడక నోర్మూసికొని వచ్చినత్రోవబట్టుము.

[శచీదేవినిలాగుచుండ మహాకాళుడజవక్త్రి కరంబుగ్రైకొని యీవలకీడ్చును]

అజ- [స్వర్ణముఖమభినయించుచు] ఔరా ఏమియీతని సాకుమార్యము ఏమయ్యా పరస్త్రీల నిట్లంటవచ్చునా ఇదేమి యాగడము,

మహా- గొప్ప శీలవతివని తెలియక నిట్లానర్చితిని క్షమించి నీదారిని నీవుపొమ్ము,

అజ- ఏమి నన్నేపొమ్మనుచుంటివా ఎంతతెలివికలవాడవయ్యా,

మహా- నా తెలివితో నీకేమి నీదారిని నీవుపొమ్ము,

అజ- నేనెక్కడకుపోగలను?

మహా- పోనీ ఇక్కడనేయుండుము,

అజ- నేనిక్కడనుండుట నీకిష్టమేగదా

మహా- నాయిష్టానుసారమే వర్తింతువా యేమి?

అజ- ఆ త్రికరణశుద్ధిగా

మహా-అట్లైననీవు మందిచటనుండి వెడలుము

అజ- న్యాయమా నిన్నిట బాయ నాప్రాణములుండునా?

మహా. పరీక్షింతిము నీవొకసారిపొమ్ము?

అజ- పోయిన పోవుటేగదా చేసెడిదేమి,

మహా-ఏవిషయమైనను, అనుభవించినగదా తెలియుట

అజ- ఇంకనేమడతమాటలు కట్టిపెట్టి నన్నేలుకొనుము

(వెడలిపోవును)

మహా-[దూరమేగి] ఛీఛీ సిగ్గుమాలినదానా.

అజ- నీవేమన్ననునాకు సంతోషమే

మహా- అదియును నాదురదృష్టమే,

అజ- మనోహరా ఆకుదితానైవలచుట పురుషులకెంత యదృష్టమో నీవెరుగవు,

మహా- నేను పురుషుడనని నీవెట్లు గ్రహించితివి?

అజ- ప్రాణేశ్వరా నన్నెంత వెఱ్ఱిదానినిగా దలంచితివి

మహా- పిశాచి మాటాడక ఇటనుండి వెడలుము.

అజ- [సమీపించి] నేనేమంటినని కోపగించెదవు ఇదిగో నా మాటవినుము

మహా- వినకున్న నేమొనరుపు?

అజ- ఇట్లొనర్తును [కౌగిలింపబోవును]

మహా- ఇకనీకు నాచేతిలో చావుమూడినది

అజ- ఆ ఏమంటివి నన్నే చంపుదువా ఎవతెననుకుంటివిచచ్చు దేవతను కాను అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండగు శూరపద్మాసురుని సోదరినని తెలిసికొనుము.

మహా- అబ్బా ఎంతగొప్ప దానవు.

అజ- అంతపంహాసమా నాగొప్పతనము చూతువా?

మహా- ఏ మోసీదయ

అజ- ఇక నాలసించిన మరియాదదక్కదు.

మహా- నేనును త్వరపడుచు నేయుంటివి,

అజ- ఏమిచూతు రేమి దీనినీడ్చికొనిరండు నేనీతని పనిబట్టెదను [మీదికేగును]

మహా- ఓ యున్మాదినీ ఎంతచెప్పినను వినకుంటివి నీకు చేటు దప్పదు,

అజ- ఏమా పొగరు [మీదబడును]

మహా- దురాత్మర్దురాలా చావుము [అజవక్త్రి చేయిన అకుసు]
(అజవక్త్రి హాహాకార మొనర్చుచు క్రిందబడును)

(తెరబడును)

శ్రీమత్ ములుగు సుబ్రహ్మణ్యారాధ్య విరచితం
కుమార విజయనాటకం
ద్వితీయాంకం సమాప్తం—

# తృతీయాంకము.

## మొదటి రంగము.

—వీరమాహేంద్రపట్టణ రాజాస్థానమున— శూరపద్ముడు సింహవక్త్రుడు
తారకాసురుడు భానుకోపుడు — మంత్రులు — సామంతులు
కొలువుదీరి యుందురు —

శూర— ఓరా ఎంత సాహసము ఎంత సాహసము తరువాత
తరువాత,

అజ- తే॥ గీ॥ ప్రమథుడట యింద్రసతికి సంరక్షకుడట
పతిని నేనీడ్వ వాతండు శాతఖడ్గ
మునను నా చేయినటికె పొమ్మనుచు తన్నె
యింక నేమి వచింతు నహీతలేంద్ర॥

శూర— దేవతలకింత కండ కావరమా?

భాను—జనకా వారుకాన రానిపలువలు,

శూర- ఈమధ్య వారియెడల కొంత యుదాసీనము దాల్చుటచే
యీస్థితి చేకూరినది (అజముఖితో) నీవచ్చుటకేల
పోయితివి ఆమె నేల నిర్బంధింపవలసి వచ్చినది?

అజ- ఆమెసౌందర్యము నిన్నాకర్షించినదనియు ఆమెను నీవు
ప్రేమించితివనియు నెఱింగి వారలదృశ్యులై రనివిని
ఎట్టులైనను నీమనోహారిణియైన నాసుందరిని సాధించి
నీకు కానుకగా నీడదలంచి యిల్లొనర్చిన నాకీప్రాయ
శ్చిత్తమైనది. సర్వసమర్థులైన మదగజములవంటిముగ్గు
రన్నలకు చెల్లెలనై ఒక్క సామాన్యదేవతావనిత కార

ణమున ఇంతయవమాన దుఃఖమాననుభవింపవలసి
వచ్చినది నాదురదృష్టమిటులున్నది, నాకొడుకులే బ్రదికి
యున్న. నేని ట్లేడ్వవలసివచ్చునా (ఏడ్చును)

భాను అత్తా దుఃఖింపకుము మాకెవ్వరికిని జెప్పక నీవొంటరిగా
నేగుటవలన ఈవిపత్తు చేకూరినది దీనికి ప్రతీకారము
గా నా దేవతల నీకన్నులయెదుటనే చిత్రవధనొనర్చి
నీ మనశ్శాంతి చేకూర్తును— జనకా యింక మన
మూరకున్న మాన మర్యాదలు దక్కవు ఆజ్ఞనిడితివేని
ఇంద్రాదులబట్టి తెచ్చి నీ పాదాగ్రములకడనుంచెద

శూర- మంచిది నీయిష్టమువచ్చినట్లొనర్పుము,

అజ- నాయనా నీవలనగాని యీ యవమాన దుఃఖమును
మఱువను,

భాను. తండ్రీ నేనీక్షణమున వారలబంధించి తెత్తును.

అజ- నాయనా మొదట మహాకాళసమీపారణ్యముల వెద
కుము విజయుండవైరమ్మా— భాను, (పోవును)

శూర- నీవు పోయి బ్రహ్మనుదోడ్తెమ్ము (సేవకుడు పోవును)
సోదరులారా పరిస్థితుల గమనించితిరా నిర్భయులై
మన సోదరికే యింత యవమానముగూర్చినవీరు మన
లకునైతమేదో యపకారమాలోచింపకమానరు,

సిం హ- అగ్రజా కనుకన్నకే గడగడలాడెడి యీపిరికిపందలు
మనలనేమిచేయగలరు,

తార— అట్లనుటకు వీలులేదు యీ మధ్య దేవతలెల్లరు కైలాస

మునకేగి శివదర్శన మపేక్షింప నందీశ్వరుడు సమయ
ముగాదని నేటివఱకా ద్వారముననే బడిగాపులై
యుండిరట.

కూర- ఓహో ఇంతవఱకు వచ్చినదా కానిమ్మె మొనర్తురో
చూడవలయు— [బ్రహ్మతో సేవకుడు ప్రవేశించును]

కూర- ఎందులకింతాలస్యమైనది?

సేవ- నేను బోవునటికి సత్యలోకమున లేరు,

కూర- తరువాత?

సేవ- కైలాసమునకేగి తోడ్తెచ్చితిని,

కూర- [బ్రహ్మతో] మీపనికాటంకము గలిగించినందులకు
క్షమించుడు,

బ్రహ్మ-చ లకాలమైనందున పరమేశ్వరదర్శనమునకై పోతిమి

కూర- భక్తపరతంత్రుడైన శివుండేమి వరములొసంగినాడు?

బ్రహ్మ-దర్శనమాత్రముననే వరములొసంగుట కాతడంత వెఱ్ఱి
వాడా,

కూర- బోలాశంకరుడు,

బ్రహ్మ-చిత్తమిపుడేమియాజ్ఞ.

కూర- [అజిముఖినిజూపి] కనుగొంటిరా మీదేవేంద్రుని చండ
శాసనము.

బ్రహ్మ-[చూచి] అతడు కైలాసముననున్నాడుగదా

కూర-అతడిచటనున్న నేమి సర్వాంతర్యామి సంకల్పమాత్ర
ముననే సమస్తకార్యములు నెఱవేరగలవు,

బ్రహ్మ-ఆశ్చర్యము,
శూర-[హుంకరించి] ఔదాసీన్యమే ఆశ్చర్యకారణమైనది
బ్రహ్మ-క్షమింపుడు ఈవిషయము నేనేమియు నెఱుంగను.
శూర-ముందీపెకు కరముగల్పింపుము
బ్రహ్మ-అవశ్యము [మంత్రింప చేయిమొలచును]
శూర-బాధశమించినదా;
అజ- శారీరక బాధ శమించినను మానసికమింతమాత్రము నశ్వేదీరునా:
శూర-ఐన నేమనియెదవు,
అజ- నాకన్నులయెదుట నాబాధవారనుభవించినపుడుగదా శాంతిచేకూరుట,
శూర- ఇంతియేకదా (సేవకునితో, కనుబడిన నిర్జరాధముల నెల్ల, సీట్లీడ్చికొనిరమ్ము [సేవకుడేగి దేవతలతో బ్రవేశించును]
శూర- వీరలవరుసగా నిలువబెట్టి కరచరణముల ఖండించుము (దేవతలాహాకారములొనర్ప నట్లొనర్తురు)
(నేపథ్యమున) జయంత విజేతకుజయ్
శూర-అదేమి?
సింహ- మనభానుకోపుడు జయంతుని బంధించి కొనివచ్చుచున్నాడు,
అజ- శచికనుబడలేదు కాబోలు,

భాను- [ప్రవేశించి] జనకా వీరుగో అమరనాధపుత్రులగు జయంత యువరాజుగారు,

శూర- ఓహో, చాలాకాలమునకు దర్శనభాగ్యమబ్బినది,

భాను- శూర శిరోవతంసులగు జయంతకుమారులు మాయా యుద్ధమున సాంగోపాంగముగా శక్తిసామర్ధ్యముల ప్రదర్శించినారు.

శూర- ఔరా పిడుగా కుర్రడవని స్వర్గముననుండనిచ్చినందు లకు నీజన్మమును గన్పఱచితివి,

సింహ- యోధునితో జోరుట పౌరుషమేగాని అబలయెడ నిట్లో నర్చుటేమి ధర్మమో సెలవిత్తువా?

జయం- మీమాటలు నాకర్ధమగుటలేదు.

శూర- మామాటలు మీకర్ధమైన మీ చేష్టలిట్లుండునా,

జయ- క్షమించి విషయమెఱింగింపుకు.

శూర- పోనీ మీతల్లిగారి సమాచారమైనను తెలియుచా

జయం- అమె ప్రవాసి

శూర- మూర్ఖా ఎవరితో మాట్లాడుచుంటివి

జయం- దేవరవారి యాగ్రహమెఱుంగ గోరితిని,

శూర- నీకును నీతండ్రికిని తెలియకుండగనే ఇంతపని జరిగినదా

జయం- బహుకాలమునుండి నాతలిదండ్రుల జాడనే నెఱుగను

సింహ- నేటిసంగ్రామమైనను తెలియునా

జయం- అదియు మహాత్మ్యంభవమే

సింహ- ఎవరితో పోరితివో గూడ తెలియదా!

జయం—ముఖాముఖిని గుర్తించితిని
సింహ—ఇంతయహంకార మొదవినదన్నమాట
జయం- అహో హతవిధీ (తలవంచును)
తార- శంతా అసత్యములకు పుట్టినిల్లైననీవు యీ హత్యాకాండనొప్పుదువా? అగ్రజా వీరినింక క్షమింపరాదు కావున మన సోదరిపడినబాధ వీరలు సర్వథాయనుభవించుచు కారాగారమున క్రుగ్గవలయు.
శూర- దండనాయకా మాతమ్ముని యభిప్రాయమునుగమనించితివా?
దండ- చిత్తము—

(తెరబడును)

## రెండవ రంగము

—అంతఃపురమున మేనకాహిమవంతులు నారద పార్వతులుందురు—

నార- భూధరేంద్రా! ఎందులకీ దీర్ఘాలోచనము. యీకన్నియ సామాన్యకాదు దాక్షాయణీ నామమును విసర్జింప దలచి, నీతపఃపరిపాకమున నిన్నునుగ్రహించిన సతీదేవియే. యీ పార్వతి, ఈమె వివాహ విషయమున మీరేమి యాలోచించినను, పరమేశ్వరుని దప్ప, వేరొకని పెండ్లాడను.
హిమ- మునీంద్రా! ఇదేమి విపరీతము,
మేన- పరమేశ్వరుడేమి మా పార్వతిని వివాహమాడుటేమి.

నార- ఇందేమియు విపరీతములేదు. మీ బిడ్డయును మమకార మున నిట్లనుచుంటిరి కాని, ఈపె పరాశక్తి. తప్పక శంకరుని చేపట్టగలదు.

హిమ- ఇదియొక గొప్ప విప్లవము.

నార- కాదీశ్వరేచ్ఛ.

హిమ- నాకేమియు పాలు పోవుటలేదు.

నార- వినుము! అర్తులగు దేవతల కిచ్చిన వాగ్దానమున, ఈపెకు కుమార సంభవమగును. నీపర్వత సానువు లందే శివుడున్నాడు. ఆతని యుపచారర్థమై హైమ వతి నుపయోగింపుము.

హిమ- కుమారీ! నారదమహర్షి వాక్యములు వింటివిగదా?

పార్వ- ఆ మహానీయుడు త్రికాలవేది.

హిమ- అయిన నీయిష్టమేమి,

పార్వ- (నిరుత్తరము)

మేన- అమ్మా, ఉగ్రుడగు రుద్రుని యూడిగము నీవొనర్ప గలవా! వలదు వలదు.

పార్వ- తల్లీ ఎంత మాటాడితివి.

చ॥ పరమకృపాంత రంగుడగు - భర్గుడు యుగ్రుడె పాపజాతికిన్
తిరముగఁగొల్చు భక్తులకు - దివ్యవరంబుల నిచ్చుపట్ల శం
కరుడనుమాట నిశ్చయము - గాన భయంబును వీడనాడి స
త్వరముగ నామహామహుని - దాస్యమొనర్పగ బంపవేడెదన్॥

మేన- బిడ్డా! పసికందువగు నిన్నొంటిగా విడువగలమా.

పార్వ- తల్లీ మీకాభయము వలదు. ఈశ్వర సాన్నిధ్యమున గూడ భయమా. ఆతడభయ ప్రదాతయని వినలేదా.

మేన- కుమారీ! నీకింత ధైర్యమెట్లావవినది.

సీ॥ కఠినకర్కశ శిలా । కంటకావని నెట్లు
తిరిగి పుష్పాదుల । తెత్తువమ్మ
లలియగాధము లైన । చలినీట నేరీతి
స్నాన పానాదుల । సలుపుదమ్మ
ఎట్లారుబయట వ । సించి దుర్భరమైన
యెండవానలను స । హింతువమ్మ
అరుచి కరంబులౌ । శాకముల కాయల
దినియెట్లు లాకలి । దీర్తువమ్మ

తే॥ గీ॥ అకట యాచ్ఛాదనము లేని । యడవినేల
నేవిధంబున బండి ని । ద్రింతువమ్మ
కూడదీపట్టుదల వీడ । నాడుమమ్మ
కడగి మామాటవినుమ బం । గారు బొమ్మ॥

హిమ- కుమారీ! మీయమ్మ మాట వినుము.

నార- భూధరదంపతులారా! ఏలయీవ్యథ, భగవదనుగ్రహమున ఈమె శాశ్వతానందమందగలదు. ఆలసింపక ననుజ్ఞయిండు.

మేన- మహర్షీ, నీవును, మాయమ్మ మార్గమునే సమర్థింతువా.

నార- సార్థకమగు కృత్యము నెవ్వరైనను సమర్థింతురు.

హిమ- ఇకమాది వ్యర్థ ప్రలాపమా.

నార- ఎన్నటికిని కాదు.

కం॥ పరమాత్ముండగు శంకర
కరుణన్నీ సుతకు సకల కల్యాణంబుల్
దొరకును నీయౌన్నత్యము
స్థిరమై జగములవెలుంగు శీతనగేంద్రా.

హిమ- చిత్తము. మహాత్ముల వాక్యము లమోఘములు గదా

పార్వ- అమ్మా, ఇంకను నీమనసు కుదుటబడదా.

హిమ- ఈ మహానుభావు డకారణముగా నేపనికిని ప్రోత్సహిం పడు. కావున విరోధము తగదు.

మేన- స్వామీ! ఇదివఱకెన్నడు నొంటిగా నుండి యెఱుగదు

నార- సఖీసమేతముగా నుంపవచ్చును.

మేన- మహాభాగ్యము. కుమారీ నీయుద్దేశమేమి.

పార్వ- జయా, విజయలను దోడ్కొని పోదును.

హిమ- మహాత్మా! ప్రయాణ సుముహూర్తముగూడ, మీరే నిర్ణయింపుడు.

నార- మంచిది? రేపటి, బ్రాహ్మీముహూర్తము సర్వాభీష్ట ప్రదము,

హిమ-తమయాజ్ఞ శిరసావహించితిమి,

నార- ఇంక నే నేగవచ్చునా?

హిమ-నేడు మాయాతిధ్యముస్వీకరించి మమ్ముద్ధరింపుడు,

నార- మంచిది దానికేమి,

మేన- దేవరవారి దర్శనభాగ్యము మాకెన్నటికి లభించునో

నార- ఎన్నటికనసేల అతిశీఘ్రకాలముననార్యకల్యాణమున

హిమ- ధన్యోస్మి

(తెరబడును)

## మహాతప రంగము,

—సౌధాంగణమున రతీమన్మథుల ప్రవేశము—

రతీ- త్వరపడి యేకార్యమైనను చేయరాదు,

తే॥ గీ॥ అతిథిచేబామజంపించు నట్టిసురల
పొగడితిలవబ్బి రుద్రుని నగజగూర్చ
యత్నమునకీవుబూనమే లందగలవె
యకట యుగ్రుడు ఫాలాక్షుడనుట వినవె॥

మన్మ- నేనాతని నెఱుంగననియా నీయూహ అతడు త్రిమూర్తులలోనివాడే నేనా మూర్తిత్రయమున పురుషోత్తముని పుత్రుడను తెలిసినదా,

రతీ- ఇంతమాత్ర మెఱుంగకపోలేదుకాని అతడు త్రిగుణాతీతుడనుమాటమాత్రము విస్మరించితివి,

మన్మ- ఇటువంటి వెర్రివేదాంతముల మాత్రము నాకడను పన్యసింపకుము,

చ॥ అతడెటువంటివాడయిన నస్మదనూనప్రసూనసాయక
ప్రతతికిలోనుగాడనుట- భావ్యముగాదు విరాగియై వన
క్షితిని సమాధినిష్ఠను వశించెడియోగివరేణ్యులైన నో
క్కత్రుటిని కామినీచరణ- కంజములన్ భజియింపజేసెదన్॥

రతీ- నేనుమీసామర్థ్యమును శంకించుటలేదుకాని——

మన్మ- ఈ సందేహమేల చెప్పదలచిన దేదో శీఘ్రముగా
రతీ- మీరాగ్రహించిన నేనేమి చెప్పగలను,
మన్మ- ఇందాగ్రహకారణమేమున్నది,
రతీ- అటులైన నామనవియాలింపుడు,
మన్మ- మంచిది కానిమ్ము,
రతీ- మీరీనాడు ప్రయాణము మానుడు,
మన్మ- ఎందువలన?
రతీ- ఈ యుదయమునుండియు నామన మాందోళనము
జెందుచున్నది,
మన్మ- కారణము?
రతీ- తెలియుటలేదు.
మన్మ- ఇంతమాత్రమునకే సంశయమా,
రతీ- ఇదియేకాదు నేడేమో అన్నియు నపశకునములే
దాపురించినవి,
మన్మ- వీటన్నిటికి మనోదౌర్బల్యమే కారణము,
రతీ- కాదు క్షమించుడు.
మన్మ నీకు మతిపోయినట్లున్నది.
రతీ- మీరేమన్నను సహింతునుగాని విడువను,
మన్మ- (కోపముతో) ఏమి విడవక బంధింతువా యేమి!
రతీ- నేనంత గయ్యాళిని కాను,
మన్మ- దీని పేరేమి.
రతీ- నేను మిమ్ము విడిచియుండుటకు నామనమొప్పుట లేదు

గీ॥ నిమురఁబోయెడి సర్పము । న్నేపినట్లు
కద్దపులినోట చేయి చా । పించినట్లు
అస్త్రసంధానమున నున్న । యభవు చెనకఁ
జూచుట బ్రమాదకరముగా । దోచె నాకు॥

మన్మ- అబలవగుట నిట్లుధైర్య మొందుచుంటివి గాని, త్రిలోక విజయుండనగు, నా బారిబడిన వాడెవ్వడును జితోస్మి యనకమానడు.

రతీ- మీకీధైర్య మెందువలన గలిగినదో, నాకు దోచుట లేదు.

తే॥ గీ॥ బాలుని మృకండ సూతిఁ । నిర్బంధబఱచు
యముని జంపి యతనికి దీ । ర్ఘాయువొసగి
నట్టిభక్తార్తి హరణుడౌ । యభవుతోడ
వైరమూనుట శ్రేయమా । ప్రాణనాథ॥

మన్మ- నీమాటలయం దసత్య మణుమాత్రమైన గానరాదు కాని, నీభర్తనైన నేనట్టీ యసత్యదోషమున కొడిగట్టుదునాయని చింతించుచుంటిని,

రతీ- ఇట్టియుపాయమున ననృతదోషమాపాదించబడని పెద్దలవాక్యముగాదా,

మన్మ- (నిరుత్తరము)

రతీ- ఏమి యూరకుంటిరేమి?

మన్మ చ॥ పరమ కిరాతరాక్షసుల- బాధలకోర్వగలేక నిర్జరుల్
బరువడి నన్నుబిల్చి- యచలాత్మజ శంకరుగూర్చదే నినున్

పక్కరులగు దైత్య హంతకులఁ జంపు కుమారుడు గల్గుగాన నీ
పరమరవీడి యీపనికిసై జనుమన్న శిరంబునూపితిన్॥—

అంతియేగాని కేవలయజ్ఞానమునకాదు— కాని ఇది
విరమించిన ప్రమాదమిపుడు తప్పదు.

రతీ- మీ మాటలవలన దేవతలవలని భయమున నేగదా
మీరీపనికి పూనుకొంటిరని తోచుచున్నది, దేవాదిదేవు
డగు నాతనికపకారమొనర్చుట శ్రేయోదాయకమని
నమ్మి

మన్మ- నేనొనర్చుపని అతనికపకారమెట్లగును,

రతీ- కాదా?

మన్మ- పరస్పరానురాగముగల ఆదిమదంపతుల సంధానము
అపకారముగ పరిణమించునా? ఏమో విశ్వసిం
పదగినది గాదోపదు,

రతీ- మీరొనరించుపని ప్రపంచమునకుపకారమైనను— పర
మేశ్వరునికాగ్రహ కారణముగాకపోదు;

మన్మ- ఎందువలన?

రతీ- భగవంతుడు భక్తపరతంత్రుడు భావశూన్యమైన
కృత్యమాత్రమపకారముగానే భావింపగలడు.

మన్మ- ఇది దురూహ,

రతీ- దురభిమానగ్రస్తమగు మీ హృదయము సత్యాన్వే
షమునకసమర్థమైనది.

మన్మ- స్త్రీలకు ప్రపంచజ్ఞానముండదు

రతీ- పరమార్థ వివేకమును నేఁటికిని తీసివేరు.

మన్మ- (కోపముతో) ఇంక నీ వాచాలత కట్టిపెట్టుము. హరిహరాదులు తలక్రిందైనను యీ ప్రయాణమును విరమించను ఇప్పుడే పోయెదను, (పోవును)

రతీ- అమంగళము శాంతించుగాత. బుద్ధిఃకర్మానుసారిణీ యనిగదా పెద్దలు చెప్పుదురు యీ దేవతల నిర్బంధమున నేఁగదా నాపతి యీపనికీయకొనుట పరమేశ్వరుడు మాత్రముగుర్తింపఁడా కానున్నదికాక మానదు. ఆపదుద్ధారకుడగు నాతడే నాకు శరణ్యము,

— గేయము —

ప- భవభయార్తహరణా, శశిభూషణ

అ- శివశంకరగిరిజారమణా ॥భ॥

చ॥ సురలబోధలవు జిక్కి నామనో
హరుడు నీపైకిజను దెంచినాడు
కరిమాతనిక్షమియించి రక్షించుభారమునీపైగలదు పరాత్పరా ॥భ

(తెరబడును)

## నాల్గవ రంగము

—పార్వతీదేవి విచారగ్రస్తయై జయావిజయలతో సంభాషించుచుండును—

జయ- దేవీ యూరడిల్లుము యూరడిల్లుము,
భగవంతుడగు శంకరుడు దయార్ద్రచిత్తుడు సంశయింపకుము,

పార్వ- సఖీ అతఁడు భక్తపరతంత్రుఁడనుట సత్యమే నేను మాత్రమామహనీయుని అనుగ్రహపాత్రనగుటకుందగినదానను గాననుటకు మొన్నటి సన్నివేశము తార్కాణముగదా శ్రేయాంసి బహువిఘ్నాని, యనునట్లు యిట్లు జరిగినది.

జయ. దానికిందగిన కారణమేదో యుండకపోదు. ఏదిమెట్లున్నను మన్మథుడంతి సాహసమునకొడిగట్టుట తగనిపని,

విజ- అస్వతంత్రుఁడగు నతడేమి చేయగలడు అమరనాథుని యానతిగదా,

జయ- వారైనను పరమేశ్వరుని వంచింపదొరకొనుట భాగ్యమా.

విజ- ఆపత్కాల మాలోచనా శూన్యమనుట యబద్ధము గాదు, కాన దీనవంచనముండదని వారియూహకావచ్చును,

జయ- వెర్రికాని భగవంతునకు ప్రమాదముండునా?

పార్వ ఇదంతయు నా దురదృష్టమే నా సేవయే నిశ్చలమైన యిటులేల జరుగును,

మ॥ భగవంతుండగు శంకరుండు కరుణాపారీణుడై వచ్చియీ
నగమందుంట మదీయ భాగ్యమని యానందంబునన్ బొంగియుం
డగనీ మన్మథ హంతకుండతని నిష్ఠన్మాపయత్నించి తా
జగనా వాంఛలనెల్ల మాపెగద, యీ తీరిట్లు ప్రాప్తించునే॥

విజ— దేవీ ఇందునీ యపరాధమేమిగలదు?

జయ- అతని యపరాధమును కానరాదు, ఇదియంతయు దేవతల ప్రోద్బలమున నేగదా జరిగినది కావున ప్రకృత మెట్లున్నను పర్యవసానమీ యిరువురకును మంగళప్రదముగా పరిణమించకపోదు.

పార్వ-ఇపుడింతైనదిగదా ముందేమి కాగలదో యెవరు చెప్పగలరు,

జయ- అట్లుధైర్యపడకుము సర్వజ్ఞుడగునా మహాదేవుడు దీర్ఘకోపిగాడు

విజ- ఆయన ఘనలీల లద్వితీయములు ఏసమయమున నేరూపము నెందునో యెవరికెఱుక.

(నేపథ్యమున) మహాదేవ మహాదేవ

పార్వ-జయా యెవరో మహాత్ములరుదెంచినట్లున్నది. దోడ్కొనిరమ్ము

(జయలోనికేగి మాయావటునితో ప్రవేశించును.)

పార్వ-మహాత్మా దయసేయుడు,

విజ. (పీఠమిడి) అర్ఘ్యా దీనవాసీనులుగండు

వటు- (తేరిపారచూచును)

పార్వ-దేవా యీయాతిథ్యమున్గొనుడు.

(ఫలపుష్పములిడి నమస్కరించును)

వటు- (స్వీకరించి) కల్యాణం భూయాత్

జయ- మహాత్ములయోగమునమున ధన్యులము.

వటు- కన్యలారా! మీరలివన దేవతలవలె నున్నారు. ?జయా;

జయ- మహాత్మా యీమె హిమవంతునికూతురు మే మీమె చెలికత్తెలము.

వటు- ఓహో ఈమె గిరిరాజపుత్రిక యంతఃపురమున నివసింపదగిన యీమె కాంతారవాస మొందిన దేమి కారణమో

విజ- యోగీంద్రా పరమేశ్వరుని సేవార్థమై జనకునిచే నియోగింపబడుటవలన,

వటు- ప్రభువులకిదియొక యున్మాదము

విజ- అదేమి అట్లనుచుంటిరి.

వటు- దురాశ యెట్టికూరకృత్యమునకైనను వెనుదీయదు

విజ- మీమాటలు వింతగానున్నవి,

వటు- మామాటలలోని వింతను గ్రహించితివిగాని మీ ప్రభునిమంతన మెఱుగవైతివి.

విజ- మా ప్రభువు సాధుసేవాపరతంత్రుడు.

వటు- ఆశ్రయమున గలిగిన దురభిమానముచే యుండును

విజ- మాయుద్దేశ్యము మీకుబోధపడినదిగాదు.

వటు- వీరలకు నీవేప్రతినిధివిగాబోలు వినుము.

గీ॥ ఎట్టిస్వార్థపరుడేని ఇంచుకంత,
కరుణచూపకి యీఘోరకాననమున

కడవిమానసి సేవకైయనుళ బిడ్డ.
కీడగల్గునె యీగట్లనేడుతప్పు.

విజ- మీ విపరీతసంభాషణమును మేమోర్చినను మాజేవి సహింపదు కావదయచేసి యూరకున్న సంతసింతుము

వటు- పాపము పసిపాప కష్టనష్టము లెట్లెఱుంగగలదు.

పార్వ- స్వామీ అవ్యాజకరుణా స్వరూపులైన మీరునావిషయమై చాల శ్రమపడుచుంటిరి పూర్వాకృతమును భవింపక తీరకదుగదా!

వటు- నీకీ చిన్నతనముననే ఇట్టివైరాగ్యమెట్లుగలిగెనాయని విచారించుచుంటిని.

పార్వ-మహాత్మా మీరేమనుచుంటిరో నేను తెలుసుకొనలేను గాని అనవరతము నా హృదయమా పరమేశ్వరుని యందే లీనమైయుండును;

వటు- ఐననీ కైహిక భోగాపేక్ష లేదన్నమాట.

పార్వ- అదేమో నేనెరుగనుగాని పరమేశ్వరారాధనముననే తరింపగలనను నమ్మకముగలదు. కావున నామహేశునే వరించితిని,

వటు- ఓహో వరించుటగూడానా.

పార్వ-అవును త్రికరణశుద్ధిగా

వటు. వరించుటన నేమనుకుంటివి.

పార్వ-యోగీంద్రా మీపరీక్షను నేనాగగలనా!

వటు- నా పరీక్షకే తాళగలేని దానవు నిటు తపస్సెట్లారాధింతువు,

పార్వ- అయ్యా నన్ను భయపెట్టుచుంటివా యింతమాత్రమున నే నా యుద్యమమును విరమించుట కంత చపలను గాను.

ఉ॥ సాదరమూర్తియైననిటులాక్షుడు, సాత్త్విక మప్రసన్నుడై
నాదుసపర్యలన్ ముదమునన్ గొని, తృప్తిని గాంచియుండ డా
హ్లాదమునన్. మఱుండతని మార్గ్గము నచ్చోటు వాసెగాని, నా
హైదయవీడి గాదుసుమి, పావనబ్రాహ్మణవంశవర్ధనా॥

వటు- నీవు ప్రకృతము మఱచితివి నేనడిగినదొకటి నీవు చెప్పునదొకటియు,

పార్వ- మీ యభిప్రాయము నేను గమనింపకపోలేదు నా మాటలయందలి నిశ్చితార్థమును మీ రెఱింగియు తెలియనట్లు వర్తించుచుంటిరని నాయూహ.

వటు- అట్లైన్నటికిని తలంపకుము

పార్వ- అయిననా పొరపాటును క్షమించి సావధానులుగండు

చ॥ త్రికరణశుద్ధిగా శివు వరించితి భర్తగ నింకనాడు జీ
వికఁ,కతడే సమస్తమని వేయువిధంబుల నమ్మియుంటి, దీ
నికినొక మాత్రమేనియు జనింపదు మార్పు విధిప్రయుక్తమా
వికలము సంభవింప, తను వీగతినుండదు రాగిసత్తమా॥

వటు- ఏమీ యింతపట్టుదలయా అతడవశ్యుడైన నంతరింతువా యేమి

పార్వ-అది పతివ్రతలకొక ఘనకార్యముగాదు.

వటు- ఈమాట మరియు నాశ్చర్యముగొల్పుచున్నది.

పార్వ-ఎందువలన?

వటు- కన్యక పతివ్రత యెట్లగునాయని

పార్వ-బాహ్య వివాహవిషయమునే మీరెఱుంగుదురుగాని,
మానసిక మాలోచింపరైతిరి.

వటు- అయ్యయ్యో ఎంతమోసపోయితిని ఎటువంటి దు
రాత్ముడైనను నింతపాపమున కొడిగట్టునా.

పార్వ-మోసము పాపము.

వటు- ఇంక సందేహించుచుంటివా?

ఉ॥ అన్నులమిన్నవై పరిణయావసరంబును గాంచినట్టి నీ
కన్నతికంబుచూప సమకట్టిన ధూర్తుడెవండొ కౄరుడై.
పన్నిన కుట్రయంచకట భావమునందు, దలంపవైతివీ
తెన్నన జన్న నీదుగతి దేవుడెఱుంగు సరోజలోచనా॥

సావధానవై నామాటల స్వారస్యమెరుంగుదువుగాత,

సీ॥ కట్ట బట్టయు లేక గజచర్మ చేలంబు
కటితటంబున దాల్చునటకుడతడు
పట్టెడన్నంబు సంపాదించుకొనలేక,
హాలాహలము మ్రింగినట్టిఘనుడు
ఉండనిల్లును లేక యూరవెల్పల, శ్మశానమున
వసించెడి యమియతండు
పెట్టసొమ్ములు లేక, పెనుపాపపేరులు
మొదలపైదాల్చెడి బడుగతండు,

తే॥ గీ॥ మంచివారలతోడ సంబంధమొగి,
దయ్యములతోడఁదిరిగాడి, యయ్యయతఁడు
చెప్పఁదలఁచినచో నెన్నొ చెప్పవచ్చు.
యీమహాత్ముని కృత్యము లిందువదన॥

కావున నామాట విశ్వసించి, నీబుద్ధిని మరల్చుకొమ్ము

పార్వ-[నిరుత్తరము]

వటు- నీ యాలోచన నా స్థితిగమనించిన నాకుఁగొంచెమాశ కలుగుచున్నది, ఏమనిన యీతనివెర్రిచేతలు నీవును కొన్ని వినియుండియే నావలన సాంగోపాంగమెరింగి ప్రతిక్రియను బూనినట్లున్నది కావుననింకను విని పించెద,

చ॥ ఉదధిమథింప నందమృత ముద్భవమందెను తొల్లి జానికై,
త్రిదశులు దైత్యులున్ బెనఁగ శ్రీపతి వారల కయ్యమార్పన
య్యదనున మోహినీవనితయై చనుదెంచిన నామహాత్ముఁడా
మదవతి వెంటనంటె, జనమంతయు నవ్వఁగ నేమి చెప్పెదన్॥

కావున నామాటవిని ముందుగతి నాలోచింపుము నా విషయమైనే చెప్పుకొనుటంత న్యాయముగాదన్నను ముగ్ధవగు నిన్నుగురించిన జాలిచే చెప్పుచుంటిని, కనుక తిన్నగావినుము,

ఉ॥ ఏను సమస్తవిద్యల నెఱింగితి యాత్మబలంబుచేత నా
మానస మెప్పుడున్ బ్రణవమంత్రమునన్ రమియించు యౌవనం
బూనియు బ్రహ్మచర్యమున నున్నతి గాంచినవాఁడ నాటనో
మానిని నన్వరించుమను మానము మాని శుభంబు నీకగున్

పార్వ—ఓహో శృతిమించి రాగమునబడుచున్నదియీామహా
    త్మని సాగనంపుడు.

జయ— స్వామీ ఇకదయచేస్తారా?

వటు- ఎచ్చటికి?

విజ— తమరెచటినుండి దయచేసితిరో అచటికి

వటు— (మాటాడడు)

జయ- మా మాటలు మీాకు వినిపించుటలేదా?

వటు- నావలన మీాకేమివిరోధమునల్గినదో చెప్పగూడదా,

జయ- మీాయవాచ్య సంభాషణమున మాదేవికి మనోవ్యథ
    గలిగినది.

వటు. మేము మీాదేవికి హితోపదేశముజేసితిమిగాని వేరొం
    డేమియు ననలేదే,

జయ- అంధప్రాయముగా మీమతమను వదించినవారికి మీా
    యుపదేశములు హితములేగావచ్చునుగాని వివేకవతి
    యగు మా పార్వతికివి సరిపడవు—

వటు- గొప్ప వివేకము.

విజ- బ్రహ్మచారీశతమర్కటాః, అనునట్లు తమరేమొ
    యుంగుదురు,

వటు- నీవామెకన్నను బుద్ధిమంతురాలవు

విజ- ఎందువలన:

వటు. ఆమె సదుద్దేశ్యము సాంగోపాంగముగా నెఱుంగుట
    వలన,

జయ- యింతమీ వాచాలతను కట్టిపెట్టి వచ్చినత్రోవనే జనిన మీకును మాకును మర్యాద దక్కగలదు.

వటు- మేము కలకాలమిచ్చటనే యుందుమని మీతో నేమైన చెప్పితిమా యేమి.

జయ- తమరు జెప్పవలెనందులకు తమయభిప్రాయమే చెప్పు చున్నదిగదా,

వటు- ఒక్కమాట చెప్పిపోయెద నంగీకరింతువా,

జయ- ఒక్కమాటవద్దు అరమాటవద్దు తమరుశీఘ్రముగా దయచేయుటయే తమవాయి.

విజ- ఇంకను బయలు దేరవేమయ్యా

వటు- ఏమా తొందర కంటకులేనిదురద చేమకున్నట్లు ఆమె మాట్లాడకున్నను మీాపోరెక్కువైన దేమి——

పార్వ- స్వామి వృథాకాలయాపన చేయుట ఎందుకు దయ చేయుడు,

వటు- పోవుదునుగాని నేను

జయ- తమరు తపరే గనుక తర్లండి,

వటు- అబ్బా కొంచెమాగుము [పార్వతితో] నీవుబాలికవు

జయ- ఆమాట సర్వులకు విశదమే ఇప్పుడు మీారిక్కడ నుండి, విచ్చేయుట కుశలము.

వటు- పోకున్న నేమిచేసెదవు?

జయ- ఏమిచేతునా మహానుభావా బయలుదేరండి అని సాగనంపుదును [చేతులు ఒట్టుకొనును]

వటు- ఓసీ గయ్యాళి ఎంతపనిజేసితి వే స్నాతకుడనైననన్ను మైలబరచితివి

జయ- అదుగో అక్కడనొక చెరువున్నది దానిలో మునగండి (అని మీదికిపోవును)

వటు- నీవు మీదిమీదికి వచ్చుచున్నావు, జాగ్రత్త

విజ- ఏమయ్యా ఏమిజేసెదవు (బట్టలాగును)

వటు- అమ్మాయీ చూశావా చూశావా యిదేనామర్యాద

జయ- యిటువంటివానికి వే మర్యాదలు

(పైయుత్తరీయములాగును)

వటు- ఆగుమాగుము [వటుడు పార్వతివైపుజన జయావిజయలు చెరిబక చేయిబట్టి లాగుచుండ పరమేశ్వరుండు ప్రత్యక్షు

పార్వ-[నిర్విణ్ణసాంజలియై] నమస్తే పరమాత్మా అపరాధిని

క॥ కరుణాహరా హారా స్మరహర,
దురితాంధకార మార్తాండ హరా
శరణమ్మి ననుబ్రోవగ
నెరదెంచిన వాడవనుచు ననుకొందుశివా (పాదములబ్రాలు)

శంక- గిరిజా సంకోచింపక నీ మనోభీష్టమెరింగింపుము

పార్వ- దేవాదిదేవా సర్వజ్ఞుడవగు నీననే నెఱింగించునంతదాననా,

శంక-అయిన నాలశ్యమెందులకు కైలాసమరుగుదుమా,

పార్వ-స్వామీ మీయాజ్ఞమీరుదాననా అయిన నింకొక మన విగలదు.

శంక- ఆలస్యమేల చెప్పుము

పార్వ- క॥ ననుగనిన మొదలు సంతస
మునబొంగుచు నింతవరకు పోషించిన నా
జననీజనకులకియ్యది
మనమున కానందమా తమ రెదల్పదగున్ ॥

శంక- ఓహో యిదియా నీయభిప్రాయము అయిన చిర
కాలముననే విధ్యుక్త వివాహమగుగాత.

పార్వ-ధన్యోస్మి ధన్యోస్మి—

—గేయము—

ధన్యతము రాలనైతింగదా సదాశివా
మాన్యనైతి మహాదేవ నీకృపామహిమచేతనే
ఎఱిగి యెఱుంగకనే జేసిన సేవలకుముదమంది,
పరమాత్మా నను నావంశంబును పాలించినావు— ॥ధన్యత॥

(తెరబడును)

శ్రీమత్ మలుగు సుబ్రహ్మణ్యారాధ్య విరచితం
కుమార విజయనాటకం
తృతీయాంకం సమాప్తం—



# చతుర్థాంకము.

## మొదటి రంగము.

—అంతఃపురమున పార్వతీ ప్రవేశము—

పార్వ- [క్రోధావేశమున] ఓ అసహానపిశాచులారా ఎంత పనిజేసితిరి,

కం॥ సురలారా నేఁధరించెడి
వర తేజము నేలుపఱచు పాపాత్ములు మీ
కరుదగు సంతానము మీ
తరుణులు వంధ్యలయిమిగుల- తపియింతురోగిన్॥—

శంక- (ప్రవేశించి) ఎంత సాహసమెంతసాహసము దేవ లోకమునకెంత మహోపకారమొర్చితివి,

పార్వ-వారలు మహోపకారమొనర్చిరిగాబోలు దుర్మార్గులు

శంక- గౌరీ చాలపొరబడితివి.

చ॥ మనకుగుమారుడైన సుకు_మారుడు గాంగతటంజనండు నీ
కనులకు విందొనర్చు తృటి కాలమునందు నిదిట్లులుండ నీ
వనవసరంబుగా సురల కార్తిని గూర్చితి వేమనందు నీ
పని శతధామదీప్సితము పాయుము కోపము పాపహేతువౌ॥

(నేపథ్యమున) కుమార జననీజనకులకు జయమగుగాక.

శంక- నారదుడుగాబోలు

పార్వ-ఆయన కడుపుబ్బుదీర నుపన్యసించి మీకానందము. జేకూర్పగలడు,

నార- (ప్రవేశించి)

గీ॥ ప్రకృతి పురుషులకానంద భావభవుడు
జగదుపద్రవ సంహార సాహసుండు
శరవణోద్భవుడైనట్టి షణ్ముఖుండు
ఎల్లసుఖములనొసగి రక్షించుగాక॥

నమస్తే పరమాత్మా (నమస్కరించును)

పర- దేవమునీ స్వాగతము- ఆసీనుల కరంపుము.

నార- లోకగురూ నేటికిగదా దురదృష్టులగు యమునుల మనోభీప్సితము లీడేరినవి.

తే॥ గీ॥ పార్వతీపరమేశుల పరమకృపను
పార్వతేయుండు జాహ్నవీ ప్రాంతమందు
వర్ధిల్లుచునుండె నింకమా వనటలెల్ల
తీఱినను చింతపము మితి-మీఱుచుండె॥

పార్వ- నారదా ఏమి యీ యసందర్భప్రలాపము

నార- మాతా తమసన్నిధానమునా,

పార్వ- కాకేమి

నార- తల్లీ క్షమింపుము అట్టియపరాధమీ నారదునివలన నెన్నటికిని సంభవింపదు శివనేత్రోద్భవమగు నాదివ్యతేజము వాయ్వగ్నులు భాగీరథీతటమందలి శరవణమునునుంప అందుషణ్ముఖ దేవుండుద్భవించె ఈ క్షణముననే తామచ్చోటికి విచ్చేసి మాకానందము కూర్తురుగాక—

పార్వ- (శివుని జూచును)

శంక- ఆలస్యమేలదేవీ ఇపుడే పోవుదము

— మూావురు నిష్క్రమింతురు —

(తెరబడును)

## రెండవ రంగము

(మేరుపర్వత సానువుల దిక్పాలురు ప్రవేశింతురు)

దేవేం- మీా భయమునకు గారణము మనోవైకల్యము గాదుగదా

వాయు- ప్రత్యక్షముగా జూచిన దానికనుమానమేలగల్గును

అగ్ని- అతి లోకప్రభావులగు నాయుధములసామాన్యులు

ఈశా- ఈ విషయమై సందేహింప భావ్యముగాదు.

నైఋతి- ఇంతియేల సమీాపముననే వారలుందురుగాన అచటి కేగిన యథార్థము బోధపడగలదు,

కుబే- మహేంద్రా ఆలసించిన ప్రమాదముతప్పదు పులిమీద పుట్రయనునట్లు లిబాలకులవలన లోకమునకు మరి యొక యుత్పాదము సంభవించుట తథ్యము,

యము- వారి చర్యలన్గాంచిన నాకును భీతావహముగల్గినది,

వరు- సురాధినాథా మనకుమరియొక ముప్పుదాపరించినది వాస్తవము—

చ॥ కనుగొన పిన్నపాపలుగ- గన్పడు చుండిరిగాని, వారలే
వననమునగల్గు కప్పారమృగవర్గము నెల్ల వధించి సత్వరం

భువజని దిగ్గజంబులకు బూనిక దొడ్డొనివచ్చి గాటగ
ట్టిన ప్రళయాంతకుల్ సుమిగడించి మునొంటిమి పాకశాసనా॥

దేవేం- అహో యింతపనికిదలపడినారా ఐన విప్రదేవారల
నెదిరొడ్డెదము (నేపథ్యమున) సోదరులారా
మనమీనాటికి యాటజాలించి యింటికేగుదము
వాయు-మహేంద్రా త్వరపడవలయు వారలిచ్చటికే వచ్చు
చున్నారు. (యుద్ధసన్నద్ధులగుదురు)
(నవవీరులతో కుమారస్వామి ప్రవేశించును)
కుమా-సోదరులారా మనమీనాటికి యాటజాలించి ఇంటి
కేగుదమా?
వీరబా-అగ్రజా మన మీగిన యీ గజములగతేమి కావ వీని
నధిరోహించి బయలుదేరుదము.
కుమా-మంచిది అట్లేగానిండు,
దేవేం-బాలకులారా! ఆగజములనేల బంధించితిరి ఎవరివను
కుంటిరి?
వీరబా-ఎవరివైన నేమనుకొంటిమి ఎక్కుటకు బంధించితిమి
దేవేం-ఏమా నిర్భయము
వీ.బా-భయమనుమాట మాపంచకైనరాదు.
దేవేం-ఓహో మీరు చాలాధూర్తులవలెనున్నారు,
వీ.బా- అదిమీ గ్రహనాణశక్తికి గల్గిన మాంద్యముగాని
మా నైజముగాదు,

గీ|| కీర్తికై పాకులాడు నికృష్టజనులు
మూర్ఖవర్తనమున నీతిదూరులగుచు,
నిరపరాధుల బాధించు నీచకృత్య
ములకు దొడగుదు. రది, మాకు ముదము, నిజము||

దేవేం- మీ అహంకారమునకు మేర లేనట్లున్నది,

పీ.బా-అహంకార మమకారముల సహజములనియా మీ యూహ,

దేవేం- తారతమ్యజ్ఞానము వలదా?

పీ.బా-అదిలేనివారు మూర్ఖులే

దేవేం- మీ యాకృత్యమార్య సమ్మతముగా గ్రహించిరా?

పీ బా-పురుష జీవితము పౌరుషప్రధానము

దేవేం-పరద్రవ్యాపహారము గూడ పౌరుషముగా దలంచిరి గాబోలు

పీ.బా-కాదు కర్తలము హర్తలము

దేవేం- మిమ్ము మీరినవారు లేరనియా?

పీ.బా-ఇంతవరకిట్టులే యనుకొనుచుంటిమి

దేవేం- మీరనుకొనునదెల్ల సత్యమేనా?

పీ.బా- నిస్సందేహముగా

దేవేం-ఎందువలన

పీ.బా-ఆ ద్వితీయమగు మా పుట్టుకవలన

దేవేం-మీ పుట్టుపూర్వోత్తరము ఎరింగింతురు?

పి.బా—అవసరమువచ్చినచో నెఱింగింతుము

దేవేం-ఈ యాదేశము త్రిలోకనాథుడగు మహేంద్రునిది గా నెఱుగుము.

పి.బా-బాగు-బాగు- సహసాక్షులా తమరు

దేవేం-(గర్జించును)

యము—మంహేంద్రా వీరలతో మాటపిన్నాటగాదు త్వరపడుము.

దేవేం—శమనా వీరల కాలపాశమున బంధింపుము,

పి.బా—వెనుక మార్కండేయుని బంధించినవాడేనా యీ యముడు

దేవేం—అర్భకులారా వీరల నష్టదిక్పాలకులుగా తెలియుడు

పి.బా—నష్టదిక్పాలకులు (నవవీరులు గొల్లున నవ్వుదురు)

యము-(కన్నులుజేమి) ఏమంటిరి?

పి.బా-మీరనిన దే

యము- ఇంక వీరలసహింపను

దేవేం—డింభకులారా మీ మేలుగోరి చెప్పుచున్నాను గజములవిడచి, మీదారిని మీరుపొండు లేదేని నాపవులపాలగుదురు తెలిసినదా?

పి.బా-అనుభవజ్ఞులగు మీమాటలు దెలియకుందుమా,

దేవేం—అయిన త్వరగా బొండు,

పి.బా-మా స్వామియాజ్ఞ పాలింతుము

దేవేం-ఇందు మీకొక ప్రభువుగూడాగలడా,

వీ బా. మాకేగాదు సర్వలోకములకు [కుమారునిజూపి]
ఇతడే మాస్వామి పాదాభివందన మాచరింపుము
దే వేం- [గంభీరముగా] బాలులారా నోర్మూయుడు
[వీరబాహుడు, ఖడ్గమెత్త కుమారుడు, వారించును]
కుమా- దేవేంద్రా మాతోమీకీ వాగ్వివాదమేల మీత్రోవన
మీరు పొండు
దేవేం- మేమే కయ్యమునకిచ్చ్యకొంటిమా
కుమా- కాకున్నను మీరిచటనుండిచనుట శ్రేయస్కరము
దే వేం- మాసొత్తుకైపోరుట ధర్మమా
కుమా- పోరొనర్పవలయుననిగూడ మీ యభిప్రాయమా
దే వేం- సామోపాయ మనుకూలించినచో చేయునదేమిగలదు
కుమా- దండమే
దేవేం- అదిమాకు తెలిసిన విషయమేగదా చెప్పనవసర
ముండదు,
కుమా- సరే మీ యిష్టమువచ్చినట్లు నొనర్చుడు,
దేవే- గోళ్ళబోవుదానికి గొడ్డలెందుకని అనుకొనుచుంటిమి
కుమా- మీ యుద్దేశ్యము మంచిది యిపుడేమందువు?
దే వేం- మా గజములవిడిచి మీరరుగవచ్చును,
కుమా- అవిమీవని మే మెఱుగములగదా
దే వేం- దిగ్గజములనుమాటనైన వింటిరా
కుమా- వినలేదు—

దేవేం-యిప్పుడు చెప్పుచుంటిమి వినుడు మేము దిక్పాలకు
లము అవి మాసొత్తు

వీ.బా-ఇంకసందేహమేమి రాజులసొమ్ము రాళ్ళపాలేగనుక
మా కనుభవనీయములే

దేవేం- బాలురతో చెలిమిజేసి భాషింపకుమా యనునట్లున్నది
మీతో సంభాషణము

కుమా- కాదు కాదు చాలాదక్షిణ భాషిరం

దేవేం- బాలకులారా ఇది పిన్నాటగాదు

ఉ॥ బాలకులంచు మీయెడ కృపాగుతి బల్కిన బల్కులెల్ల మా
చేలతనంబు గాదలచి, పేలుచునుంటిరి. నేను మునేక్షచే
జాలిదలంచినన్, విడువజాలదు వజ్రముగాన మీరలీ,
కూళతనంబు మాని, బ్రదుకుందెఱవెయ్యదియో యెఱుంగుడీ॥ —

వీ.బా-వజ్రమన రాయిగదా. అదేమిచేయగలదు?

దేవే- ఇక క్షమింపను కాచుకొనుడు—

(వజ్రాయుధము ప్రయోగింప వీరభాహుడు విరుచును)

వీ.బా- దేవేంద్రా ఇట్లుచితికి పోయినదేమిది

దేవేం- అయిన నీమారుగనుగొందురుగాక

(అని గదమెత్త బ్రహ్మవచ్చి వారించును)

బ్రహ్మ-మహేంద్రా నీకుమతిపోయినదా యేమి మొదవను
గొని యీ కుమారులతో యుద్ధమునకియ్యకొంటివి

దేవేం- మహాధూర్తులదే వీరలెన్ని చెప్పనను వినకుండిరి

బ్రహ్మ.-చాలుచాలు శివకుమారులగు వీరల క్షమార్పణ
నేడుము [దిక్పాలకులు భయమభినయింతురు]

దేవే.-[వణకుచు] అపరాధివి క్షమింపుడు [సాష్టాంగమిడును]

కుమా.-మహేంద్రా లెమ్ము ఇంత భయ మొందుచుంటివేమి?

దేవేం.-చ॥ ఎవని మహోదయంబు జగదేక మహోదయమై చెలంగునో,
ఎవని కృపాతిరేకమున నీ విపదంబుధి దాటనుంటిమో
ఎవని పవిత్రనామము స్మరించుచుంటిమొ, యింతకాలమా
భవుడిటు నిన్నదిచ్చె తిమ పాయునే మాదురితంబు షణ్ముఖా॥

బ్రహ్మ.-సర్వేశ్వరకుమారా దీనాతిదీనులగు నీదిక్పాలకుల
ననుగ్రహించి వీరల యజ్ఞానకృతమగు అవినయమును
క్షమింపుము,

కుమా.- [మందహాసమొనర్చును]

బ్రహ్మ.-దేవసేనాని నీవు ప్రసన్నుడవుగాకున్న యీ దివిజు
లకీ ప్రపంచమున చోటులేదు కావున ననుగ్రహింపక
తప్పదు, ఇది పరమేశ్వరుని వరప్రసాదము.

కుమా.-ఓహో యిదినిజమా (దిక్పాలురతో) ఇఁక మీరేగ
వచ్చును దిక్పాలురరుగుదురు

బ్రహ్మ.-యింక నేనేగుదను (పోబోవును)

కుమా.-ఏమి యితని యవిధేయత (బ్ర) ఓయీ నీవెచట
నుండుదువు? ఇవుడేలతగవరివైతివి? ఎచటికేగుదువు?

బ్రహ్మ.-[సగర్వముగా] సత్యలోకాధిపతియగు పరమేష్ఠిని.
యువకులైన మీ కుమరుల నజేంగించి విడిపించుటకై
వచ్చితిని కైలాసమునకేగుచుంటిని,

కుమా-నీ కృత్యమేమి? యే విద్యల నెఱుంగుదువు?

బ్రహ్మ-యీ బ్రహ్మాండములలోని సచరాచరమగు జీవకోటి యంతయును, నా సృష్టిలోని దే గమస్త వేదశాస్త్రము లను నేనుకర్తను

కుమా-బాగు బాగు అనంతకోటి బ్రహ్మాండములను నాయకుడవన్నమాట

బ్రహ్మ- [సగర్వముగా దలయూపును]

కుమా అయిన సర్వతంత్ర స్వతంత్రులైన మీవలన మీసందేహములన్నియు తీర్చుకొనవచ్చును—

బ్రహ్మ-నిస్సంశయముగా

కుమా-ప్రణవమననేమి? ఓంకారవాచ్యుడెవడు?

బ్రహ్మ-ప్రణవమన పరబ్రహ్మస్వరూపము ఓంకారమే తదర్థము నన్నే పేర్కొనును—

కుమా-అయిన మీరే పరమేశ్వరులన్నమాట

బ్రహ్మ-ఆహా ముమ్మాటికి

కుమా-అయిన మీరిపుడు కైలాసమునకేలపోవుచుంటిరి.

బ్రహ్మ-మాకేబుద్ధిపుట్టిన నట్లాచరింతుము,

కుమా-ఏమీ యీదురహంకారము సోదరా ఈతనిబంధించి కారాగారమున నుంపుము,

బ్రహ్మ-ఓహో మీరలసామాన్యులవలెనున్నారు నేనెవడనని, బంధింపబోరకొంటిరి మీకియ్యది సాధ్యమా

కుమా- సాధ్యాసాధ్యముల నెఱుంగుటకే సంకల్పించితిని,

బ్రహ్మ- పసికందులగు మీరు మాయాగ్రహమువలన భస్మమగుదురు,

కుమా- మంచిది వీరమరణము సంస్తవనీయమైనదిగదా? తమ్ముడా ఆలస్యమేల (వీరబాహుడు మీదికేగును)

బ్రహ్మ- బ్రహ్మాస్త్రమునకు మించినదికలదా (అస్త్రయోగ మభినయించును)

వీర- ఓదురహంకారహారిణీ వాణీరమణా నిన్నింత వరకు విజ్ఞానవంతునిగా భావించితిమి నీమూర్ఖమునకుందగిన ఫలమనుభవింపుము (బంధించి గొంపోవుచు)

కుమా- తమ్ములారా మనమీనాటికి వనవిహారము నాపి జీవనవిహారమొనర్తమా?

వీర- తమ యిచ్ఛానుసారమే,

కుమా- అదిగో కనుచూపమేరలో చక్కని జలాశయము గలదు, దాననీదులాడుదము [అందరుపోదురు]

(నేపథ్యమున)

గీ॥ ఓ మహాదేవ నీసుతు, డుగ్రుడగుచు,
విధిని బంధించి, తానే, యీ విశ్వమెల్ల,
సృష్టిజేయ దొడంగె విశృంఖలముగ,
నింక తమ యిష్టమెట్లొ, విధింపగలరు॥

కుమా- తమ్ములారా వినుచుంటిరా,

వీర- ఆహా వినుచుంటిమి— దేవతలు దేవదేవునితో విన్న

వించుకొనుచున్నారు,

కుమా- ముందేమిజరుగునో చూడవలయును.

వీ. బా- జరుగుటకేమున్నది భగవంతుడు భక్తవత్సలుడుగదా

కుమా- విడువమని నందీశ్వరునంపుదామేమి.

[నందీశ్వరుడువచ్చి నమస్కరించును]

వీ. బా-సంకల్పసిద్ధులుగదా మీరు

కుమా-ఏమో ఇటువచ్చితిరి?

నందీ- పితాజ్ఞ నివేదించుటకు

కుమా- మంచిదే

నందీ- తెలియకజేసిన యపరాధముల, క్షమించి విధిని విడువుమని

కుమా- తెలియనిదైనచో యింతదనుకరాదు

నందీ- కుమారస్వామీ దీర్ఘముగ మాలోచింపుడు అతడీశ్వరాజ్ఞా, పరిపాలకుడగు సృష్టికర్త అతని బంధించుట లోకోపకారముగా నెరుంగుము--

కుమా- నీవు చెప్పినవిషయమాతడు గ్రహించినచో అతనికి శాస్తిజరుగదు,

నందీ- మా కృత్యము సమంజసమైననూ, ఈశ్వరసమ్మతముగాదు

కుమా- ఈశ్వర సమ్మతముగానిది సమంజసమెన్నటికినికానేలదు,

నందీ- ఇపుడీ వివాదమువలన ప్రయోజనము శూన్యముకా
వున పితృ ఆజ్ఞ పాలింపుము

కుమా- నీవొక ధర్మదేవతవుగా మాట్లాడుచున్నావు కాని
నన్ను గుర్తించినట్లు కనబడదు,

నందీ- నావిధి నేనెరుగుదును కావుననిట్లు చెప్పవలసి
వచ్చినది,

కుమా- ఇంక మారాడితివేని, నీవిధి, యీవిధి ననుసరింప
గలదు. తెలిసినదా- తెలుసుకొనగలవా—— ఊ-
మాట్లాడవు

నందీ- మహాసేనా, క్షమించి నాకు సెలవిమ్మా

కుమా- బుద్ధిమంతుడవు- ఇక నీ విన్నాటికిని, యిటువంటి
రాయబారములలో రాకుమా

నందీ- చిత్తము - (పోవుచుండ అందరూ నవ్వుదురు)

వీ.బా- అగ్రజా- యితడింత పిరికివాడా.

వ.కే- ఆయన ధైర్యస్థైర్యము లద్వితీయములు

వీ.మా- ఎట్టులో బ్రతికి బయటపడినాడు.

కుమా- తమ్ములారా! మీరా రాతని సామర్థ్య మెరుగరు.
అతడద్వితీయ మహిమా సంపన్నుడు. మా తండ్రి
గారి కత్యంత ప్రీతిపాత్రుడు,

(పటాక్షేపమున శంకరుడు ప్రవేశించును.)

కుమా- జనకా! అభివాదనము, (వీరభాహాదులు, నమస్క-

రింతురు.)

శంక- కుమారా! విజయీభవ, యిచ్చటికి నంది రాలేదా

కుమా- వచ్చినాడు.

శంక_ ఏమి చెప్పినాడు.

కుమా- బంధితుడగు, బ్రహ్మను విడువుమని

శంక- విడిచితివా,

కుమా- లేదు.

శంక- ఎందువలన?

కుమా- అతడపరాధిగనుక

శంక- నీవో

కుమా- నే నేమపరాధ మొనర్చితిని.

శంక_ మాయాజ్ఞ మన్నించితివా,

కుమా- (నిరుత్తరము.)

శంక- (కోపముతో) యిప్పటికైననూ విడుతువా? లేదా.

కుమా- ఊహూ.

శంక- ఏమీ. నీ యాగడము.

కుమా- (పాదముల వ్రాలి) తండ్రీ క్షమింపుము.

శంక- ముందాతని విడువుము?

కుమా- చిత్తము శంకరా! నీవేగి విధిని, విడిచిపుచ్చుము.
తండ్రీ! యీ కృత్యము తమకింత యాగ్రహ కారణ
మగునని యనుకొనలేదు.

శంక— [ప్రసన్నుడై కుమారుని చేరదీసి] కుమారా! బ్రహ్మ నేల బంధించితివి.

కుమా. అతని, గర్వోపహారమునకు

శంక- నన్ను. తిరస్కరించినాడా-

కుమా- నావిషయమైన, నింతకువచ్చినా—

శంక- సవిస్తరముగా, జరిగినదేదో చెప్పుము

కుమా... మాకును, దిక్పాలకులకును, జరిగెడి వివాదమున, తగ వరియైవచ్చి, సర్వజ్ఞత్వమును ప్రకటించినాడు.

శంక- నీ వేమడిగితివి, అతడేమనెను.

కుమా- ప్రణవార్థ మడిగితిని, అపార్థము తెల్పినాడు.
[మందహాసమున] దాని నీవెఱుంగుదువా,

కుమా.- [నిరుత్తరము.]

శంక— పోనీ యీ విషయము నా చెవిలో చెప్పుము, [చెవి ముందిడ కుమారుడు వచింప, సంతసమున] కుమారా! నీ విపుడు సుబ్రహ్మణ్యుడ వైతివి, కాని, యీ విషయము నీ వెట్లెరింగితివి.

కుమా.- మా మాతయగు, శ్రీమాతవలన

శంక— కుమారా! ధన్యుడవైతివి. యీరహస్యము పరమ మాహేశ్వరుడగు, అగస్త్యమహర్షికిం దక్క, నితరుల కెఱింగింపకుము, భక్తికోటి యాతనివలన తరింప గలదు.

కుమా- తను యాజ్ఞానుసారమే వర్తించెదను
శంక- బిడ్డా! ఇంతమాత్రముననే నీపనితీరదు, వినుము.

గీ॥ శూరపద్మ సింహవదన తారకులను
రాక్షసులు పాపరంబున రాణకెక్కి
జగములను నేపదొడగి రీశక్తివలన
వారి బరిమార్చిరమ్మ సత్వరమే యిటకు॥

[శక్తినొసంగును.] తెలిసినదా? ఆలసింపకుము.
కుమా- చిత్తము, తమ యాజ్ఞానువర్తినై, వర్తించెదను.

(తెరబడును.)

## మూడవ రంగము

—(పటకుటీరముల, కుమారస్వామి, బృహస్పతి, ప్రవేశింతురు.)—

కుమా- దేవగురూ! మాతండ్రిగారి కర్మారుల, కింత యౌన్నత్యమొసంగుటకు, కారణము దురూహ్యాగా నున్నది.
బృహ- స్వామీ! అకారణముగా వీరలకు, యీపదవి లభించలేదు కశ్యపాత్మజులగు వీరలు, మాతయగు మాయాదేవి, సహాయమున ఘోరమగు, వీరయాగమున ని జనకుని మెప్పించి, యీపద్ధతికి వచ్చినారు.
కుమా- ఓహో! ఇదియా కారణము, ఐన నామహాత్ముడేల వీరల వధింప నాజ్ఞయిడె దీనికేమందురు.
బృహ- స్వామీ! సాక్షీభూతుడగు, పరమాత్మునకు పక్షపాత ముండునా? కృత్యములకుం దగిన ఫలమును భ

వింప మనియెగాని, పరుల హింసించి, ప్రపంచ మల్ల కల్లోల మొనర్పుమనెనా

కుమా- అద్వితీయమగు నైశ్వర్య మనుభవించు చున్నాను. వీరలకేల తృప్తిగలుగదో

బృహ- దేవా! దురాశయే దీనికి గారణము.

కుమా- ఒక్క అసంతృప్తియే, సర్వనాశమునకు కారణమగును గదా,

బృహ- తమ రెఱుంగని దేమిగలదు.

కుమా- సంగ్రామ విశేషము లేమియు వినవచ్చుట లేదు. కలహభోజనుడు నైతము గాన్పించుట లేదే.

[నేపథ్యమున] దేవసేనానీ, రక్షింపుము రక్షింపుము.

బృహ- మహాసేనా! నారదమునీంద్రు దార్తుడై వచ్చుచున్నా డేమికీడు మూడినదో,

నార- నమస్తే కార్తికేయా! త్వరపడి దయజూడకున్న, అమరసేన అంతరించగలదు.

బృహ- అదేమి? అదేమి?

కుమా- భయపడకుము! సాంగముగా జెప్పుము,

నార- షడాననా భవత్సోదరులగు, వీరబాహుల యాహ్వానమున తారకాసురుండు రణభూముల జేరి, ఘోరంబుగా బోరి, తమ సేనచే గాసిబడి, మాయాయుద్ధమున క్రౌంచాద్రి బలమున, నెల్లవారల బంధించె.

మీరా యాపదవారింపకున్న ప్రమాదము సంభవింపకమానదు.

కుమా-(మందహాసమున) నారదమునీ, దేవాసురసమరములలో నీవుజూడనిదేమిలేదుగదా? ఇంత తొందరపడుచుంటివేమి—

నార- స్వామీ మీరేమనుకొనుచుంటిరో యీ తారకాసురుడసామాన్యుడు వాడి బారినబడినవాడెవ్వడును బ్రతికి బయటబడుట కల్ల

కుమా-అనుమానమేమివలదు ఆస్మత్సోదర సహాయమున మన సేనకేమియు నాపదసంభవింపదు అయిననాలసించుటెందులకు యిపుడే వెళ్ళి యాతని బలపౌరుషముల, బరిశీలింతము,

నార- దేవరవారియానతి సుసగుణా నీవునూవచ్చెదవా?

బృహ-ప్రభునియాజ్ఞ

కుమా-కరే అందరము పోవుదమురండు

—(నిష్క్రమణము)—

(తెరబడును)

## నాల్గవరంగము

( పరివారసమేతుడై అట్టహాసమొనర్చుచు ఖడ్గహస్తుడగు తారకుడు ప్రవేశించును )

రాక్షసు-శూరసోదరా మీరా పేరువిన్నంతనే నూరామడదూ

రము పారిపోవు నీయమరాధములకెంత ధైర్యము
గలిగినది,

తార- అట్లగుటకు వీలులేదు వీరికేదో మహాదాశ్రయము
లభించినది,

రాక్ష- సేనానంగనివారెవరు వీరలకు లభించిరి వీరిసేనాని
కడు పిన్నవాడు అతని సోదరులంతకన్న చిరుతలు
ఇటువంటివారల సాయమున మిమ్మెదుర్కొనుట
కొండతో డీకొను గొర్రెచందముగదా,

తార- దేవసేనాని యువకుడా?

రాక్ష- పదిపన్నెండేళ్లవాడు యువకుడెట్లగును

తార- అయిన నతడెవరి కుమారుడు?

రాక్ష- శివకుమారుడని ప్రతీతి కాని శరవణోద్భవుడు

తార- ఓహో ఇదేమియద్భుతము శివునికుమారుడైన పరమ
భక్తులమగు మనపైకేలరాగలడు,

రాక్ష- ఇదియంతయు దివిజులదుస్తంత్రము

తార- ఊ, హూ కానిమ్ముచూచెదము

రాక్ష- చూచుటకేమున్నది ప్రథమమగబలమున నేమక్షికాపాత
మైనది ఇకవాడు బ్రతికి బయటబడినప్పటికిగదా?

——నేపథ్యమున

శా॥ ఓరా తారక, దుర్మదాంధ యిటు మాయాయుద్ధయోధుండవై
కారాగారమొనర్చి మాయనజాలన్ క్రౌంచాద్రి బంధించుటే
వీరత్వంబని పొంగిపోర్లబడడే, విచ్చేసె నీగర్వపం
హారుండైన కుమారుడీ యెడలనీ యార్థత్వముంజూపుమా——॥

తార— (ఆలించి) ఎవరివీ ప్రగల్భములు—

రాక్ష— దేవా! శ్వేరపడవలయును ఆవాక్యములు దేవసేనాని వే

తార. అబ్బా యీశక్రౌడా నన్నుపాలంభమొనర్చువాడు రానిమ్ము.

రాక్ష. ప్రభూ అటుజూడుము అటుజూడుము దుర్నిరీక్ష్యమా తేజము—

తార— (లోనికిజూచి) ధన్యోస్మి ధన్యోస్మి యీజ్యోతి పరంజ్యోతియే శివకుమారునకుదప్పయితరునకీవెలుగు కలుగునా మాకన్నులకిని గలుగదు,

( నారద బృహస్పతులతో కుమారుడు ప్రవేశించును )

కుమా— నారదా యిదియేగదా క్రౌంచాచలము దైత్యులెవ్వారును గానరారేమి యెదుర్కొనిపోరాడుట వారెరుంగనట్లున్నది—

తార— (యెదుర్పడి) నిజమే మహానుభావా నిజమే యింతవరకు మమ్మెదుర్కొనువాడే లేనపుడు మేమా విషయమెట్లెరుంగగలము—

కుమా— బాగుబాగు పౌరుషమన్న నిట్లుండవలయు

తార— పౌరుషమునకేమిగాని మీ కౌమారము మాత్రము ప్రేమపాత్రమైనది.

కుమా— యింకమాకు కొదవేమి మాకోర్కెలన్నియు నిశ్శంకముగా నెఱవేఱగలవు.

తార- ముమ్మాటికి.

కుమా-అయిన మీయుదంతము వినకుతూహలము గలదు,

తార- తప్పక వినిపింతును సావధానులుగండు వేయునెసి మిది బ్రహ్మాండములకై యేక సార్వభౌముడగు శూర పద్మాసురుని చిన్నతమ్ముడ నా నామధేయము తార కాసురుడందురు నా పరాక్రమ మొకింత వినకుతూ హలమున్న చో వినిడు,

ఉ॥ పుట్టినాటగోలె రణభూమి పరాజయమన్నమాట నె
వ్వట్టునసైన గన్పడదు భంగురలీల సుదర్శనంబుచే
పట్టిన బూరుషోత్తముని భండనమంటప జయించనట్టిబల్
దిట్టడ నన్నరుంగుమిది దాపక చెప్పితీ సత్యవారిసై॥

వింటివిగదా నాయుదంతమిక నీ విషయమెయింగింతు వేని సంతసింతును——

కుమా-మంచిది వినుము

మ॥ పరమాత్ముండగు శంకరాత్మజుడను బ్రహ్మణ్యనామంబుచే,
సురసేనాధిపతిత్వమూని సమరక్షోణిం జగత్కంటకా
సుర సంహారమొనర్పవచ్చితిని మీశూరత్వముకా వింటి సం
బరమయ్యెన్ తారకాసుర గణవ్యాపారనీరాకరా?॥

తార- ధన్యోస్మి ధన్యోస్మి శివాత్మజా ఇంతవరకు మిమ్మె రుంగని నాయవిధేయతను క్షమింప ప్రార్థించు చున్నాడను.

తే॥ పరమపావన యస్మదు పాస్యదైవ
మైన, శంకరపుత్రుడవై నీదు—
దర్శనంబున మిగుల సంతసముగలిగె,
కడగివెల్వడు మీవచ్చు కారణంబు॥

కుమా— అడిగినచో చెప్పకుంట అన్యాయముగదా కావున వినుము

ఉ॥ వీరలు సర్వలోకులను మించిన బాధలు పెట్టుచుండ వా
ఓరువలేక మా జనకునొద్దకువచ్చి వచించిరాపదో
ద్ధారక దైత్యబాధలకు తాళగలేమికనంచు నంత
నా మారహరుండు నన్నిటకు బంపగవచ్చితి మిమ్ముజంపగన్॥

తార— (వికటాట్టహాసమొనర్చి) ఇది చాలనమ్మకమైనమాట మే మే మహాత్ముని కరుణావిశేషమున నింత యౌన్నత్యమనుభవించుచుంటిమో, అయ్యనఘుడే మమ్ముజంపుటకు మీకాజ్ఞయిడిరా ఇట్లెన్నడైనను తటస్థించునా యీ వెఱ్ఱి మొఱ్ఱిమాటలు నమ్ముటకీ తారకుండంత జ్ఞానహీనుడుగాడు యీ వ్యూహమంతయు దేవతలచే కల్పింపబడి ప్రపంచజ్ఞానశూన్యులగు మాచే ప్రవర్తింప దొడగొనిరి,

కుమా— అసురేంద్రా నీవువాలా పొరబడుచుంటివి నేనెన్నటికిట్లుబద్ధ మాడువాడనుగాను ఇది పరమేశ్వరాజ్ఞ అయినను దీనిని మార్చుటకుపాయము లేకపో లేదు

తార— దయచేసి సెలవిందు,

కుమా — మీరీ, యమరుల జోలికింబోక వారల బంధవిముక్తుల
నొనర్చితి రేని మీకేయాపద వాయగలదు.

తార — ఇది, యసంబద్ధమగు మాట కావున నెన్నటికిని జరు
గదు ఏమందు రేని దేవతలు వారు పూర్వదేవతల
మేము సవతిబిడ్డలమగుట దాయాదులము మావిరో
ధము సహజమేగాని అసహజముగాదు దీనియందసు
రుల ప్రసక్తికి తావులేదు,

కుమా — మంచిదేకాని జ్ఞాతులనిట్లు బాధింతురా?

తార — అధికారచిత్త మెట్లుండునో అట్లు జరుగును,

కుమా — అధికారమున్నంతమాత్రమున అనపరాధుల హింసిం
చుటయా?

తార — అధికారశబ్దమున కర్థమేమీకు తెలియనట్లున్నది,
ఇన్నియేల మేముమీకు పరమభక్తులముగదా! మా
పైకేల దాడివెడలితిరి దీనికి సమాధానమిందు తదుపరి
పైవిషయమాలోచింతము,

కుమా — మీరిర్వురును మాకుసమానులే కావున ధూర్తులను
శిక్షింపక తప్పదు,

తార — ఇర్వురము సమానులమైన మీ తండ్రిగారు మాకీ
యధికారమెట్లొసంగినారు?

కుమా — నిరపరాధులనే చంపమని మీకీయధికార మొసంగలేదు
మీ కృత్యమునకు దగినఫలము స్వర్గైశ్వర్యములనను
భవించుటయే — —

తార— మాకృత్యమునకుగల ఫలము సర్వస్వతంత్రము
కుమా—సజ్జనులబాధ సహింపడు సర్వేశ్వరుడు
తార—సహింపక జేసెడిదేమి?
కుమా—సంహారము
తార— చేసెదుగదా! తమసేన
కుమా—ఇంతిమాత్రముననే యుచ్చితబ్బిబ్బగుచుంటివా ఒక్క గడియలోచనే నీవును నీమిత్రుడగు క్రౌంచాసురుడును నశింపగలరు,
తార— అంత మహామహులామీరు అయినకానిండదియును చూతము
కుమా—ఇపుడే చూచెదవుగాక (త్వణముభి మంత్రించి విడుచును)
తార— ఓహో ఇంద్రజాలికుడవుగూడనా,
(తెరలో పెద్దకలకలము)
కుమా—తారకాసురా అటుజూడుము మా యింద్రజాలము
(నేపథ్యమున) హాహోస్మి, హాహోస్మి
తార—చూచి నిర్వైరపడి మిత్రమా భయపడకుము ఇదే వచ్చుచున్నాడను (నిష్క్రమణము)
కుమా—ఓరీ మాయావీ నిన్ను విడుతునను కొంటివా
(నిష్క్రమణము)
(తెరబడును)

శ్రీమత్ ములుగు సుబ్రహ్మణ్యారాధ్య విరచితం
కుమారవిజయనాటకం
చతుర్థాంకము సమాప్తం—

# పంచమాంకము.

## మొదటి రంగము.

-హీరమహేంద్రపట్టణమున శూరపద్మాసురుడు సోదర మంత్రిసామంతాది పరివారముతో కొలువుదీరి యుండును—

శూర- (నలుదిక్కులకుజూచి) సభాసదులారా మీరు నేడేల చిన్నదనముననుంటిరి నేను వచ్చునంతనే నేత్రోత్సవముగ, నాట్యమొనర్చు రంభాద్యప్సరసలేలరారైరి [మరల సభన్దిలకించి] మన రాకకు పూర్వమే అప్రమత్తులై వారివారి కార్యముల వారివారి కృత్యముల వినయవిధేయులతో నూడిగముసల్పు దివిజులలో నొక్కడైననూ ఇక్కడ కన్పింపకుండుటకేమి కారణము,

అమో-కారణము దురూహ్యముగానున్నది చారులకునైతము గోచరింపలేదు,

శూర-నీమాటలు నా కర్థమగుటలేదు,

అమో- సార్వభౌమా నేనెంత ప్రయత్నించిననూ జాడపోడ గట్టదు.

శూర- ఇదచాలా విస్మయమే జనక

అమో-చిత్రము

శూర- మనచారులనైతము కనుబామనంతటి సామర్థ్యమా సోదరా!

సింహా. నాకేమి పాలుపోవుట లేదు,

శూర. అట్లని మిన్నకుందువా?

సింహా. కర్తవ్యమాలోచించుచుంటిని,

శూర. ఏలయీ వృథాయాలోచనము మంత్రీ యీక్షణము
నసేకసర్వసమర్థులగు చారులనంపి బ్రహ్మాండముల
నన్నియు గాలించి బంధించుకొని రమ్మనుము ఊ—

అమా. స్వామియాజ్ఞ [చారులనంపును]
[తెరలో] హా హా హతోస్మి హతోస్మి

శూర. ఎవడా ఏడ్పునది [అసురేంద్రుడు ప్రవేశించి శూరుని
పాదముల వ్రాలి శోకించును]

శూర. ఛీ ఛీ యభాగ్యుడా నీకేమియాపాదము?

అసు. [గద్గదస్వరమున] అయ్యయ్యో చచ్చితి చచ్చితి

శూర. (తేరిపారజూచి) వీడు మన తారకాత్మజుడు అసురేం
ద్రుడుగదా వీనికీ భయమేలదాపురించె ఓరీ చచ్చు
సన్యాసీ మనయేల్బడిలోని చీమనుసైతము తాకు
టకు వెఱచు మృత్యువునకా భయపడుచుంటివి లెమ్ము
[వెన్నుజరచుచు] బాలకా ఏల యీ వీలపడకుచుం
టివి ధైర్యము వహించి చెప్పుము?

అసు. జనకాగ్రజా— యేమనిచెప్పుదును— నీ పినతమ్ము
డును నా జనకుడును త్రిలోకవిజయుడగు తారకా
సురేంద్రుడస్తమించినాడు—

శూర. ఛీ ఛీ మతిభ్రష్టుడా— నాతమ్ముడా మరణించుట

అను- నాదుతండ్రి మరణించినాడు ఉత్తరక్రియలు సైతము జరిపినాను—

శూర. సోదరా నీనిమాటలు నిజమా పిక్కకీ కలవరపాటెట్లు గలిగినది

సింహ. వత్సా! నీవెచటనుంటివో యెఱింగియే మాటలాడు చుంటివా?

అను- కలవరపాటుచే కల్లలాడుచుంటినని మీయభిప్రాయముగాని సావధానులైన సాంగముగా జరిగినదంతయు వినిపింతును,

శూర. బిడ్డా భయపడక ప్రశాంతమనస్కుడవై వచింపుము,

అను- ప్రభో ఏమని చెప్పుదును కొలది దినములక్రిందట పెదతండ్రిగారగు సింహవక్త్రుని గృహమునకరిగి తిరిగి వచ్చుసరికి నగరమంతయు నల్లకల్లోలమైయుండ నగరి కరిగి మాతల్లులజూడ శోకభరమున చైతన్య విహీనలైయుండిరి ఇదేమి ఘోరమాయని చింతించుచూ మూర్ఛిల్లి కొంతవడికి తెలివొంది ఆవలివలివారి ప్రశ్నించి సమస్తవృత్తాంతము దెలిసికొంటిని.

శూర- త్వరగా నారవివరముం దెలుపుము,

అను_ మొట్టమొదట అకస్మాత్తుగా శివకుమార సేనాసమూహ మెత్తివచ్చి పట్టణముముట్టడించ సైర్యహేమాద్రియగు మాజనకుడెదిరించి వారలతోపోరి క్రౌంచాద్రిగుహాల బంధింప నదితెలిసి కుమారుడతిత్వరితముగా

జరుదెంచి వారల బంధవిముక్తులఁ గావర్చి నాతండ్రిని
గ్గడ తేర్చి తత్సమీపమున శాంతినగర మొకటి నిర్మించి
సపరివారుడై యందుండెనట—

సింహ_ ఓరా ఎంతసహాసమెంత సాహసము!

కుమార- ఊ తరువాత నేమిజరిగినది?

అసు- యీ విషయము దెలిసి చేయునదేమియుదోవక పిత్రు
కర్మమాచరించి మీకు విన్నవింప నిటువచ్చితిని—

కుమార- [నిశ్చేష్టుడై తెలివొంది] అతడు శివకుమారుడను
మాట నిజమా!

అసు_ ముమ్మాటికి నిజమే

కుమార_ తారకశరీరము గుర్తించితివా

అసు- ఆ శరీరముతో నాతల్లులు సహితము సహగమన
మొనర్చినారు.

కుమార_ అమంగళ ప్రతిహతమగుగాత నేడెంత యుశ్శీలము విన
వలసివచ్చినది.

సింహ- ఓరా కాలమహిమ మన జీవితమందెన్నడైన యిట్టి
విషాద సంఘటనమనుభవించితిమా ఇదియంతయు
భగవత్ప్రాతికూల్యము

కుమార- ఏమంటివి భగవత్ప్రతికూల్యమా?

మ॥ భగవంతుండగు పార్వతీపతిగొని నన్ పాలింప నేతెంచినన్
మంగమోటంబును భక్తిభావమును నిర్మూలించి తత్పుత్రుడే
యగుగా కీక్షణమందెయాతని మదీయుండైన శిక్షంబు చే
దెగగోతుంజూమి సంశయింపక లసద్దీవ్యతీ ప్రతాపంబునన్॥

సింహ- పాపము శాంతించుగాక

శూర- యేమేమి సోదరహంతకుని బరిమార్పుట యా

సింహ-అగ్రజా శాంతింపుడు,

కం॥ కరుణా వరుణాలయుడగు
హరభక్తుల మైన మనల నావహమున శం
కర పుత్రు డెట్లు పొడిగొని
పరిమార్పనటంచుదలచి పల్కితి ననుజా॥

అదియునుంగాక నీయనురేంద్రుడు పితృవియోగదుః
భయావృతచిత్తుండై యిట్లు మాట్లాడుచుండెనేమో
యని నాసందేహము,

శూర- నీకన్నియూ సందేహములే

సింహ-అగ్రజా కోపింపకుము మన కుపాస్యదేవుడగు శివ
కుమారుడగు సేనాని మనకేలకీడుదలంచును నాయన
నాందోళనమున నిట్లంటిని,

శూర- యిదంతయు దేవతల కృత్రిమోపాయము, యీ
విషయమీశ్వరుడెరింగినను పుత్రవాత్సల్యమాతని
నిరోధింపదు,

సింహ-మనసోదరుడైననూ నీతని నిజస్వరూప మెఱుంగక నే
యుద్ధము గావించెననుకొన్నను వీనిమాటలవలన సర్వ
మెఱింగియే సాహసించినట్లు తోచుచున్నది.

శూర- మనతారకుడు మహామాయావి అతడెరుంగని తంత్ర
ములు లేవు మనకైనను తెలియజేయ వీలులేని పరిస్థితిని

గల్పించి యీ ఘోరకృత్యమును గావించిన వా రెట్టి
పూజ్యులైనను శిక్షింతివ్యులుగారు,

సింహా-నిజమే కాని అసహాయశూరుడగు మనసోదరుని మరణ
వృత్తాంతము నైనను విచారింపవలదా?

శూర- అసురేంద్రుని మాటలయందసత్యముండునా?

సింహా- ఉం—డ— దు—

శూర-ఇక కాలయాపన మెందులకు,

సింహా-అగ్రజా,

ఉ॥ ఎదిరి బలాబలంబుల పరీక్షయొనర్చి రణోర్వి శేగినన్
గదనము సర్వసాధ్యమయి గన్పడు గావున గూఢచారులన్
త్రిదశుల పాలికంపి గమనింతురువారల వృత్తమాపయిన్
మదికనువైనరీతి రిపుమండలిద్రుంపగవచ్చు నగ్రజా॥

శూర- అట్లయిన నీక్షణముననే సమర్థులగువారల నాపనికై
నియోగింపుము,

సింహా-చిత్తము (మంత్రితో) యింక నాలసింపకుము

అమో. ఏలినవారియాజ్ఞ (చారులబంపును)
(తెరలో) ప్రభూరక్షించుము రక్షించుము

శూర- ఎక్కడిదీ యార్తారవము—
(భటుడు ప్రవేశించి) సార్వభౌమా ప్రమాదము
సంభవించినది,

శూర-త్వరగా జెప్పుము,

భటు- ఎవడో ఒక దుర్మార్గుడు దుర్గరక్షకుల బరిమార్చి గో

పురంబులగూల్చి అగడ్తలబూడ్చి ఎదురైనవారినెల్ల మర్దింపుచు పట్టణమెల్ల అల్లకల్లోలమొనర్చిచే వచ్చుచున్నాడు. (సభ్యులట్టహాసమొనర్తురు)

శూర— ఔరా ఏమియీ విపరీతము

సింహ—అన్నా ఇంకను ఉదాసీనమా నేవిపుడేబోయి యాతని మార్కొనెదము,

(వటాక్షేపమున వీరబాహుడు ప్రవేశించును)

వీర- పిడెగాబోలు రాక్షససార్వభౌముడగు శూరపద్మాసురుడు ఔరా వీని వైభవము వర్ణనాతీతము నన్నితడు గాంచినట్లు దోపదు (ఇంచుకధ్యానింప నెదుట నున్నతమగు పీఠమవతరింప నాసీనుడగును)

శూర- ఓరీ నీవెవ్వడవు యింతసాహస కృత్యమునకు గారణమేమి?

వీర— దురహంకారపారీణా నీవే నాశూరపద్మాసుర సార్వభౌముడవు అహాహా ఏమి నీమానమర్యాదలు,

సింహ—చాలుచాలింక నీ వాచాలతను గట్టిపెట్టుము

తే॥ గీ॥ బ్రదుకుపై వాసగలిగిన ప్రాణియెవ్వ
డీ సభాస్థలి నిరీతి నింతనిర్భ
యాత్ముడై మాటలాడడి యుర్విడను నీవు
మాత్రమగుటను మృత్యువు — దూరమయ్యె—

వీర— బాగు బాగు దయా సత్యశౌచములు మీయందే యుద్భవించినవి.

అమో- ఓయీ వృథావాచాలత్వమేల నీరాకకు కారణము
నివేదింపుము?

వీర- నివేదనము— దేవునకా, దస్యునకా?

అమో- ఓరీ వదరుబోతా నీ కావరమణంగించెద
[కత్తిదూయును]

సింహ- (అపవారించి) నీవచ్చినపని వినిపింపరాదా?

వీర- అట్లడిగిన వినిపింపకుందునా వినుడు

ఉ॥ ఏను పరాత్పరుండగు మహేశ్వర పుత్రకుడైన దేవసే
నానికి సోదరుండ కదనంబున నీయనుజన్ముఁడా మహా
సేనునితో నెదిర్చి తన సేనలతోడగతించె గాన నీ
కైనను బంపె మాతగ దయామతి నాతఁడు రాక్షసేశ్వరా।

శూర- ఓహో దూత్యమొనరింపవచ్చితివా?

సింహ- ఐననీ రాయబారముగానిమ్ము,

వీర- అవశ్యము సావధానులై వినియెదరుగాక,

క॥ అమరులు యుష్మత్కృత క
ష్టములను భరియింపలేక శంకరువేడన్
శమనారి వారి మొరవిని
కుమారునని పె సుపర్వుల గోడుడుపంగన్॥

తత్కారణమున సుబ్రహ్మణ్యేశ్వరుండు దేవసేనాని
యై మా యాపట్టణంబు ముట్టడింప నీ సోదరుండగు
తారకుండు, మదోన్మత్తుడై విజృంభించి అమరుల
క్రౌంచాద్రి బంధించి కుమారు నెదిరించె.

ఉ॥ అత్తరి కార్తికేయుఁడు దయాకరుఁడౌట ప్రశాంతచిత్తుఁడై
మత్తిలియున్న నీయనుజుమార్గ్గాన కాతని గాంచి దైత్యపీ
తోత్తము నిర్నిమిత్తముగ నూర్జితులైన సురాళి నెల్ల యు
న్మత్తుఁడవై వధింతువె కుమారమణుండిదిజూచి నైచునే।

చ॥ అనివచియించి యిప్పటికినైనను మంచిగ్రహించి తారయుం
దునిచినవారి బంధముల నూడ్చితివేని శుభంబు నీకగున్
వినుమని వేయుదెల్పిన చెవిన్జొనీయక దుర్మదాంధుఁడై
అనిఁ బొనరించి షణ్ముఖ శరాహతి జచ్చె చమూసమేతుఁడై॥

మఱియు నొక్క విశేషము జెప్పమఱచితి.

తే॥ గీ॥ తారకునివమ్మి క్రౌంచభూధరము రారి
అసురసేనల తన గుహాభ్యంతరముల
దాచి కౌమారశక్తిచే దానుగూడ
కాయమువ్విడవలసె నిష్కారణముగ॥

అమో—అయినదా ఇంకేమినసున్నదా?
వీర— ఐనంతవఱకు దెల్పితిని కానున్నది కలదుగదా
శూర—దానింగూడ కానిమ్ము,
వీర— మంచిది మాప్రభువు మీకాజ్ఞాపించున దేమన

చ॥ తెలియక మీసహోదరుఁడు తెంపరియై మరణించె వీరగలా
తెరవుఁబోక మున్ను మహాదేవుఁడొసంగిన భోగభాగ్యముల్
కలిగినదానితో ముత సుఖంబుగ కాలము వెళ్లబుచ్చగా
దలచితి రేని నిర్జరవితానము బంధవిముక్తి నయ్యెడున్॥

శూర— ఇంకనేరాయబారమైనదా?
వీర— అంత్య సందేశమొక్కటియే మిగిలినది.

కూర- దానిం గూడ గానిమ్ము

తార- సావధానముగా వీరికి ప్రత్యుత్తర మిచ్చెదను గాక.

క॥ మా యానతి మీరినచో
మీ యాయువు చెల్లెననుట మృషగాదు సుమీ
ఓ యాయసుకులార నిశ్చయ
మీయది యని చెప్పె కార్తికేయుఁడు కడకన్॥

మా స్వామి యాజ్ఞాపించిన విధానమంతయు సాంగో
పాంగముగ ముగించితిని ఇక మీ యభిప్రాయము దెలుపుడు

కూర- మీ స్వామి యాజ్ఞాపించుటయు నీవు వినుపించుటయు
నైనదిగనుక మాయుద్దేశ్య మనుభవపూర్వకముగా
గ్రహింతువుగాక (మంత్రితో) ఈతఁడు చాలబుద్ధి
మంతుఁడగు స్వామిభక్తుఁడు ఈతని మొదట బహుమా
నించుట సమంజసముగావున వెంటనే కృత్యమునకుండ
గిన శాస్తియొనరించి అంధకారబంధురమగు పాతా
ళ గుహాయందు బంధింపుము తరువాత వీని ప్రభుని
గౌరవింతము,

ఆమో- (ఖడ్గహస్తుఁడై లేచును)

సింహ- ఓ రాయబారీ నీవుచాలా పిన్నవాఁడవు ఇక మీస్వామి
యు బాలకుఁడుగానే విన్పించితివి ఇట్టి క్షీరకంఠులగు
మీతో యుద్ధము యోద్ధులంగీకరింపరు గడచిన దానికి
వగచిన ప్రయోజనములేదు ఇప్పటికైనను బుద్ధిమం
తులై మా ప్రభునకు క్షమాపణమిడిరేని మీ యా

యువునకు క్షీణముండదు గ్రహించితివా వేయునేని
మిది బ్రహ్మాండములకు సార్వభౌముడగు శూరపద్మ
సోదరునివలన నీకీయభయ ప్రదానమొసంగబడినది.

వీర- (వికటహాసమొనర్చి) బాగుబాగు దయామయుడవగు
నీయభయము తిరస్కరింపరానిదైనను నీ మూర్ఖ్యము
నకు చాల చింతింపవలసి వచ్చినది ఏమంటవేని
అనంతకోటి బ్రహ్మాండముల కధిపతియైన పరమేశ్వ
రుని కుమారుడగు సుబ్రహ్మణ్య సోదరుడనగు నేను ని
యభయమున కాశ్చర్య మొందుచుంటిని.

శూర- [హుంకరించి] ఆలస్యమేల యీ వాచాలు నితనిం
మనసే వధింపుడు— [రాక్షసులు విజృంభింతురు]

వీర_ ఓరీ చచ్చువెధవలారా మీరానన్ను వధించునది,
చూడుడు నా పరాక్రమము,

(అని కొందఱు రాక్షసుల వధించి సభ నల్లకల్లోలమొనర్చి
పోవును)

అమో. మహాప్రభూ ఇంక యోజించిన ప్రయోజనము లేదు,
దేవరయాజ్ఞ

శూర-మీరెల్లరిక్షణముననే సైన్యయుతులై వెడలి దేవసేనా
సమూహానెల్ల సిర్జయాత్ములై వధించిరండు.

(తెరపడును)

## రెండవ రంగము.

—(వీరమాహేంద్ర పట్టణద్వారమున కుమారస్వామి సేనాసమేతుడై
గొలువుదీరియుండును)—

కుమా- మహర్షీ సంశయింపకుము సాంగోపాంగముగా

వచింపుము,

నార — కుమారస్వామీ మీరీ దేవతలనుద్ధరించుటకై రాక్ష
సులపై దాడివెడలితిరిగాని వీరి బలాబలములు సక్ర
మముగా విచారింపరైతిరి తారకుడు యుక్తాయుక్త
విచారశూన్యుడుగావున మీచే వధింపబడినాడు అంత
మాత్రమున విజయము సాధ్యమని మీరెంచుట
ప్రమాదము మనవిజేయుచున్నాడను,

ఉ॥ శూరుడ సామశూరుడగు సోదరుడైన మహేంద్రవక్త్రుడీ
ధారుణి నెల్ల నొక్కపరి దగ్ధముజేయ సమర్థుడింక జే
వారిచమూపతుల్ సచివు లాహవదక్షులు వారితోడ
కౌమారమునందునున్న సుకుమారుడ నీ వెటువోరుసల్పగా
నేరుతువన్న చింత నను నేచుచునుండె సదాశివాత్మజా॥

చ॥ అదియును గాక యీజనకుడా సురఘోరతపఃప్రవృత్తికిన్
ముదితమనస్కుడై రిపుసమూహమునుక్కడగించు శక్తియున్
ముదమిడు చావుగల్గని యమోఘవరంబులనిచ్చెగాన
మీరిది గమనించి పోరువిరమించుట భావ్యమటంచు దోచెడిన్॥

సర్వజ్ఞ కుమారులగు తమకింక నేమిచెప్పగలను, దేవ
రచిత్తమునకు నచ్చినట్లొనర్తురుగాక

కుమా — దేవమునీ ఇంకేమైన విశేషములు గలవా.

నార — చిత్తము లేకేమి యవధరింపుడు

ఉ॥ తారకమృత్యు వార్తవిని దానవులందరు వీరబాహుడా
గారసభాంగణంబునను జొచ్చి మహాద్భుత స్థైర్యధుర్యులై

పారతంత్రో క్తి దూష్యమును సల్పినవారలు దుర్మదాంధులై
గారియబెట్టిరాతని నికన్ వచియించెడిదేమి షణ్ముఖా॥

కుమా—నారదా భయబడుచుంటివా శివానుగ్రహముగల
వారినెవ్వరును బాధింపజాలరు,

నార— అతడును శివానుగ్రహపాత్రుడేగదా?

కుమా— ఔగాక ఇపుడువారల చిత్తవృత్తిదోషించినది,

నార— కారణమేమి,

కుమా—కాలమా సన్నయగుటయే అదియునుగాక. ఐశ్వర్య
మదమత్తుల కహంకారము మెండగుట యుక్తాయుక్త
విచారశూన్యులై భగవంతుని సైతము తిరస్కరిం
తురు. తత్కారణమున వినాశము తప్పదు,

నార— ఏమో మీ మాటలయందు నాకు

కుమా—విశ్వాసముగల్గుట సందియమే కొంచేమోకి కజేసినచో
సర్వమును మాసోదరుని వలననే తెలిసికొనగలవు.

వీరబా—(ప్రవేశించి) జయము జయము దేవసేనానికి,

కుమా— సోదరా ఒంటరివగుట చాలశ్రమనొందితివికాబోలు,

నార— దైవానుగ్రహమున బ్రదికి బయటబడుటయే యదృష్ట
ముగాదా?

వీరబా—అగ్రజా తమ యనుగ్రహవిశేషముననాకెట్టి యాయా
సము గల్పింపదు,

బృహ—మహాశయా తమదూత్యవిశేషములు వినకుతూహల
ముగానున్నది,

కుమా—అట్లయిన సమస్త మెఱింగింపుము,

వీరబా—దేవా తమయాజ్ఞంగొని వీరమాహేంద్రపట్టణము
నకుం జని పురరక్షకులచే నడ్డగింపబడి వారల బరిమా
ర్చి అసంఖ్యాకులగు దైత్యు లెదిరింప నాలస్యమునకు
వెఱచి సూక్ష్మరూపమున శూరగుభాంగణముం జేరి
తద్వైభవమున కచ్చెరువొంది కొంతవడి మిమ్ము ధ్యా
నించుచు తన్ను దెఱవ ప్రభుసింహాసనమునకన్న
మిన్నయగు నొక్క యుత్తమాసనము గన్పడ—
దాని నధిరోహించితి.

చ॥ అడిగిన తత్సదస్య దివిజారులాకించుక విస్మితాత్ములై
మదినికలంగి నొక్క పరిమార్గ్యన నెంచగ శూరపద్ము డ
య్యది గమనించి వారల ప్రయత్నము నాపి హృదంతరాళ మం
దొదవిన కిన్క లోనిడి నయోక్తుల నన్నని పల్కె నిట్టులన్

కం॥ ఒరి యెవ్వడ విచటికి
చేరను పగవచ్చినాడ చెపుమి విశేషం
బోరయమున దెలుపుమనన్
చేరక నుతోడనంటి నిర్భయవృత్తున్॥

తే॥ గీ॥ మానమర్యాద లెఱుగని మందబుద్ధి
చెప్పెదన విన్ము శరజన్ము దేవు నాజ్ఞ
ననుచు మీరానతిచ్చిన యట్టి పలుకు
లెల్ల చెప్పితి నపుడసందిగ్ధ ఫణితి॥

ద్విపద— నా మాటలెల్ల తిన్నగ నాలకించి
యా మానుషాశను డత్యాగ్రహించి

పిట్టకొంచెము కూత పెద్ద దేయనుచు
కట్టి యీతనికింత గర్వమా యనుచు
బలుకుచు నిప్పుడే ప్రత్యుత్తరంబు
దెలుపుదుననుచును పలుగాకి యగుచు
ననుబట్టికొట్టుడంచని దైత్యవరుల
కనుసన్న పురిగొల్పగా వారలపుడు
యొక్కపెట్టున నన్ను నుక్కడగింప
పెక్కురు ననుజట్టి పెల్లార్చునంత
దిగ్గుననే లేచి దితిజులనెల్ల
నుగ్గునూచ మొనర్చి పగ్గజూపించి
అటనుండి యీవలికరుదెంచి మించి
తటుకున నాసభాస్థలి గూలదన్ని
విక్రమించిన నరివీర సేనాను
లక్రమంబుగ నొక్కసైనన్ను బోదువ
వారల నడపెడిన వజ్రబాహుండు
శూరుని పుత్రుండు క్రూరవర్తనుడు
వానికిదోడయి వ్యాఘ్రముఖుండు
పూనినాపైకి దెబ్బునరాగ వారి
సైన్యమమితంబుగా చావంగమోది
మాన్యమే యాపురి మంటిలోగల్పి
తమ సన్నిధిని జేరి శ్రీవరపాద
కమల బులర్పింప గంటిమహాత్మా!

కుమా- మహర్షీ ఇతడు వచించినవన్నియు సత్యములగునా?
నార- మహాత్మా— క్షమింపుడు
కుమా- భయమేమియు వలదు నీవు నచటినుండి యేవచ్చితివి గావున అడుగవలసి వచ్చినది.
నార- చిత్రము తమయనుగ్రహ పాత్రులకేమికొదవ
కుమా- అట్లనవలదు యీతని పల్కులయందతిశయోక్తులుండ గూడదా.
నార- ఎంతమాట నాయజ్ఞానమును మన్నింపుడు.

(పాదములబడును)

కుమా- నారదా ఇప్పటికైనను సంశయము దీరినదా ఇంక మా విజయము నంగీకరింతువా,

(నేపథ్యమున) దేవా జయము జయము

కుమా- ఎవరికీ జయము—

(నేపథ్యమున) తమసోదర విజయమునకు వృద్ధుడై ఆత్మజమరణమునకు సంతృప్తుడైయున్న తండ్రి నూరార్చి భానుసోపుడను శూరుని పెద్దకొడుకు అసంఖ్యాక పరివారముతో మనలమట్టడించి విజృంభించి సేనల నల్లకల్లోల మొనర్చుచున్నాడు,

కుమా- ఏమేమీ ఇంకను జ్ఞానముదయింపలేదా సోదరా నా రథమాయత్తపఱుపుము ఇపుడే రాక్షసులనాశ మొనర్చెద (లేచును)
వీరబా- అగ్రజా శాంతింపుడు పిచ్చుకపై బ్రహ్మాస్త్రమా

ఆజ్ఞనిడిన నేనేగి యాతని బరిమార్చెద

కుమా- అట్లయిన సోదర సమేతుడవై తగిన సేవలగొని చని విజయుడవైరమ్మా,

నార- తథాస్తు (శెలవని పీఠాదులు పోదురు)

కుమా- నారదా ఏమందువు.

నార- నేనేగి కనులారా యుద్ధముగాంచెదను

కుమా- మంచిది—

(తెరబడును)

## మూడవ రంగము

—(మందిరమున దైత్యమాత మాయాదేవియు భానుకా పుడును కూర్చుని యుందురు)—

మాయ నాయనా కాలగతి దాట నెవరితరము.

చ॥ వలదని యెన్ని జెప్పిన భవజ్జనకుండు వినండు సన్ముఖుం
డవిగిన నెల్లలోకములం నాశనమాటనిజంబు దైత్యులం
గలిగిన దానితో తనివిగాంచక నిర్జరకోటి బట్టిబల్
సిలుగుల బెట్టసాగి రదిచేటొనగూర్చె నికేమిసేయుదున్॥

భాను- పితామహీ నీవట్లనుట మాదురదృష్టమేగాని వేరొండు గాదు.

మాయ- అది యెట్లు భ్రమ మహాద్రిశేఖర ండగు శర్వపాను గ్రహమును గాంచిన దానను నేను— పంచకృత్యపరాయణుండగు భగవత్కుమారుడతడు ఆమహాత్మునితో

యెడ నాశక్తి యెట్లుపయోగించునో నీవే యోజింపుము.

భాను-మాతా నీవే యుట్లువైర్యపడిన గత్యంతరముండునా అనభిజ్ఞులు నాతండ్రులు నీ సహాయమునసేగదా వీర యోగాది మహత్తర కృత్యముల కృతకృత్యులైనది కావున నేదైన నొక్క యుపాయమాలోచింపుము.

మాయ. వెఱ్ఱివాడా — ఎవని యనుగ్రహాతిరేకమున నిట్టిపదవి లభించినదో వానితోడనే మనకీవాడు వైరము లభించి నది జయమెట్లు లభించగలదు.

భాను- అవ్వా నీవు పొరబడుచుంటివి భగవంతునికే మనపై యనురాయగల్గిన ఇంత రాద్ధాంతమేల ఈకుమారుడు శూరాగ్రేసరుడైనంతనే శైవుడని విశ్వసించుట తగని పని కావున నీవు నైరాశ్యమును వదలి బుద్ధిని వినియోగించితివేని మాకుపకారము జరుగకపోదు,

మాయ-(స్వ) ఈతడు పరమమూర్ఖుడు అదియుంగాక పరిభవానల సంతృప్తహృదయుడై గత్యంతరము గానక కుములుచున్నాడు ఎదయేనొక సాయమొనర్చక తీరదు

భాను- అయ్యయ్యో మా దురదృష్టదేవత నీకీ మాకీభావమునుగూడ బ్రసాదించినదా ఆహా దౌర్భాగ్యము నే మనవలయు,

ఉ॥ పుట్టిననాటనుండియును బొందని యీ యవమానమిట్లు చే
పట్టియు భాగ్యపుం బ్రదుకుపయిా వచ్చినవాని పోల్కి జా

పట్టుటకంటె ప్రాణములబాయు నపప్రథగూనబాయు ని
ష్పట్టుననింతకన్న సదుపాయము లేదిక నేమిజేసినన్॥

మాయ- బాబూ అతి విచారమున మునుంగకుము భగవదేచ్ఛ మున కొటంకముండదు వీరబాహుని వలన గలిగిన పరాజయమునకే ఇంత విచారించుచుంటిని, కాని నేడు నీజనకాదుల పాటు నెఱుంగకైతివి,

భాను- తల్లీ అదేమి అదేమి నీవు దూరదర్శిత్వముగూడ గలదా త్వరగా దెల్పి నా యార్తిబాపుము,

మాయ- తండ్రీ వినుమని దెల్పుదును,

చ॥ భవదపమానము న్వినిన పాటుననే రణభూమికేగి యా
భవసుతుతోడఁబోరి తన పాటవమెల్లనుజూప నాతిడా
హవమున శూరపద్ముని పరాజితు జేయుటెగాక దైత్యులన్
తనివి వధించె నేఘగిది దార్కుఁడెదీవు వచింపు మిత్త్రరన్॥

భాను- అక్కటా పరాజయమన్నమాటయే వినని నా జనకు నింకెత పాటొదలినది,

మాయ- నాయనా ఇంకను వినవలసింది చాలాకలదు? అట్లు పరాజితుడైన నాకొడుకునకేమియుండో పకపలాయితు డైనంతనే వీరబాహుండు విజృంభించి దైత్యసేనానుల ననేకులంబరిమార్చి హిరణ్యాదిందరును నాతండు బ్రదుకు జీవుడాయని సముద్రమునడాగె అగ్నిముఖుండెదిర్చి మరణించె.

భాను- (మూర్ఛిల్లును)

మాయ- అయ్యయ్యో యీతడుగూడ మూర్ఛిల్లినాడే
భాను- [తెలివొంది] మాతోస్మి మాతోస్మి తల్లీ యిప్పటికై
    నను దయరాదా,
మాయ- నాయనా ధైర్యము వహింపుము నేనొక యస్త్ర
    ముపదేశించెదను దీనిం బ్రయోగించి నీవు విజయ
    మందుము.
భాను- మహాప్రసాదము.
మాయ- [ఉపదేశించి] యీ యస్త్రము కుమారస్వామిని
    వీడి యెవనినైనను వధింపగలదు. కావున జాగ్రత్త
    గా వినియోగించి జయము గొనుము—
భాను- ధన్యోస్మి ధన్యోస్మి—

(తెరబడును)

## నాల్గవ రంగము

—(రంగభూమిని ధనుఃపాణియై వీరబాహుడు ప్రవేశించును)—

వీరబా- ఓరీ యమాధమా ఇంత యహంకారమా?

తే॥ గీ॥ పరమ మాహాత్మ్యులు నాదు భ్రాతలైన
వారి ప్రాణంబులన్ గొని బ్రదుకదలచి
నాడవే దుర్మదాంధ యీనాడె నిన్ను
చంపివైచెదనమ్ము నిశ్చయముగ నమ్ము॥

(బాణమెక్కుపెట్టును)

(నేపథ్యమున) మహాత్మా రక్షింపుము రక్షింపుము

శూరపద్మునిచే నిర్జింపబడిన తమ సోదరులు కైలాస
మునకేగి అచిరకాలమున తమసాన్నిధ్యమునకు చేర
గలరు (అష్టవీరులు ప్రవేశింతురు)

వీరబా-(తమ్ముల గాంగలించి) తమ్ములారా దురాత్ములగు
యసురులచే చాల కష్టపడితిరి,

వీరమా-అగ్రజా మన స్వామియనుగ్రహముచే నేమియు
శ్రమ కలుగలేదు శూరునివలన కైలాసదర్శన మహా
నంద మనుభవించితిమి,

వీరబా-ఎంతటి ధన్యులుమీరు రిపుని యుపకారముగూడ మీ
యెడ నుపకారముగా పరిణమించినది,

వీరకే- ఇదంతయు పరమేశ్వరవాత్సల్యము కాని యీవలి
వృత్తాంతములేమియు మీమెఱుంగము,

వీరబా-శూరుని యార్భాటముంగాంచి కుమారుండతని దల
పడి పరాజితునొనర్ప నాతండు సిగ్గుపడి పురంబుజేరె
నంతనాతని కుమారులగు హిరణ్యాగ్నిముఖులను వార
రుదెంచి ప్రమథగణంబుల జీకాకుబఱప నేదలపడి
అగ్నిముఖుని వధించి హిరణ్యుని సముద్రమున బడ
వైచితి,

వీరమా-భానుకోపుడికగనఁబడలేదా?

వీరబా-పాశుపతాస్త్రసంధానమున నే పలాయితుడైన నా
పంద ఇంకనేమొగమున నెదిరింపగలడు,

(నేపథ్యమున) ఓరీ యాత్మశ్లాఘాపరాయణా నేపారి

పోయితినని వదరుచుంటివా ఇదిగో యీ బాణమున
నోర్కఁబెట్టి మిమ్మందఱ బరిమార్చెద.

వీరమా-అన్నా యిప్పుడు వీని విడిచితిమేని మనకు దొఱక
డుగావున వీని వెంటాడి వధింతము

వీరబా-మంచిది (వీరులు పోదురు)

భాను-(ప్రవేశించి) సేనలారా వీరబాహ్వాదులు విగత
జీవులై సముద్రమున బడినారు కావున మీరు నిర్భ
యాత్ములై దేవసేనల జించిచెండాడుడు.

ఉ॥ బాలురతోడ సంగరము భండన పండితులైన వారికిఁ
జాలనసహ్యమాట రిపుసంహరుడైన సురారిభర్తనే
డాలముమానిచన్న నది యద్భుతదిగ్విజయంబుగాగ నీ
కూళలు దేవతాధములకున్ దగునేయిటు సంతసించుటల్॥

(నేపథ్యమున) ప్రమథసేనానులారా భయబడక
భానుకోపుని జుట్టుముట్టుడు సురక్షితులగు వీరబా
హ్వాదులువచ్చి వీరింగడతేర్పగలరు,

భాను-ఎవ్వరివీ ప్రగల్భములు?

వీరబా-(సోదరయుతుడై ప్రవేశించి) ఓరీ విజయుడగు మా
స్వామి వాక్యములు ప్రగల్భములా పిరికిపదవగు నీ
కూతలు జయధ్యానములా అహా యేమి నీ తెలివి
తేటలు.

చ॥ రణముననోడి వేగమ పురంబునుజేరుట దుర్బలత్వకా
రణముగ నేదలంచుట కరంబు ప్రమాదమెసుమ్మి నేడునీ

జనకుడుగూడ నీపగిది సల్పుటజూడగ యుష్మదీయ ధై
ర్యనయ వివేకముల్ దెలియనయ్యె సకృచ్ఛ్రము గాగ దుర్మతీ॥

ఇంకను సిగ్గులేక మాట్లాడుచుంటివా పౌరుషముగల వీరుడెవ్వడైనను ప్రత్యర్థికి వెన్నుజూపునా ప్రాణములు విడుచునుగాక పోనిమ్ము యిప్పటికైనను పరువుబోయినను మాటలలో మర్యాద నిలువబెట్టుకొంటివి,

భాను- క్షీరకంఠులగు మీరు యుద్ధనీతి నెట్లెరుంగగలరు,

తే॥ గీ॥ అర్భకులజంప పాశుపతాస్త్రకేల
ననుచువచ్చిన నా రాకడను గ్రహించి
నీవు పాశుపతంబు సంధించినాడ
వపుడు దానిప్రతిక్రియ నరయవలదె॥

ఇదిపలాయనమని మీరనుకొని నంత మాత్రమున లోకమంగీకరించునా?

వీరబా- బాగు మీకృత్యమునకు గొప్ప సమాధానమాలోచించితిరిగాని మీ జనకుని తిరోగతికేమి సెలవిత్తురు

భాను- మా జనకుడెన్నటికిని మీవంటివారితో పోరుటకిచ్ఛగించునా,

వీరబా- కొంతవడి పోరి పారెనుగదా,

భాను- అది ప్రమాదము

వీరబా- ఏది ప్రమాదము?

భాను- ప్రత్యర్థిని గుర్తింపక పోవుటయే

వీరబా- చూపునకేమైన లోపమున్నదా?

భాను-ఓయుద్ధానర్హ ప్రలాపీ,

తే॥ గీ॥ చూపుఁడకు లోపమున్న నా పాపశీలుర
బ్రదుకనీకుండ వీలుంగఁదె మా ప్రభుఁడిరేఁడట
అతని సుకుమారమూర్తియే యతని కాయు
వింతకీర్తిం బొనర్చెం జెంచవలదె॥

వీరబా-బాగుబాగు కరుణాసముద్రుడు శూరపద్మాసుర సార్వభౌముఁడు వారి జ్యేష్ఠకుమారులుగదా తమరు రణరంగమున కవతరించితి రేల?

భాను- మీ యనాలోచితకృత్యమే దానికి కారణము మే మెంత యౌదాసీన్యము వహించినను మీరంత చెల రేగితిరి,

వీరబా-ఏ మొనర్చితిమి

భాను-ఏ మొనర్చితిరా పట్టణమంతయు భస్మీపటల మొనర్చితిరి.

వీరబా-అదియొక బాల్యక్రీడగా భావింపరాదా,

భాను-ఏమి మీ దురహంకారము

వీరమా-అగ్రజా వీఁడు పరమమూర్ఖుడు వీనితో సంభాషణము వివేకవంతముగాదు కావున వీనినడఁ తేర్చుము,

వీరబా-మంచిది ఓయీ యిప్పుడేమందువు

భాను-ఏమందునా మిమ్ముఁదర నొక్కపరి బరిమార్చి నాకోప మునకు శాంతి యొనరింతును ( బాణమెక్కుపెట్టును )

వీరబా-( ధనువుఖండించి ) దుర్మార్గుడా యీ దెబ్బతో భగ

వద్దూషణమునకుం దగిన ఫలమనుభవింతువుగాక—
ఖడ్గమువిసర భానుకో ప్రదదృశ్యుడగును)
వీరశా_తమ్ములారా మీరిం దేయుండుడు మాయావియగు
నీతని వధియించి ఇప్పుడే వత్తును—
(నిష్క్రమించును)
వీరమా-[ఆకసమువంకజూచి] సోదరులా యీయసురుఁ డెంత
మాయావియో గనుగొనుడు,

తే॥ గీ॥ మీటవిఃణుగురు చందాన మెఱసి మెఱసి
అగ్రజుని పెట్టుల లయించునసురహంతకు

[నేపథ్యమున] హా, హా హతోస్మి హతోస్మి
దహాహా సోదర ఖడ్గప్రహారమంది
భానుకో వుందు ప్రాణముల్ బాసెనపుడె॥

వీరకే_ సోదరులారా మనమేగి యీ యుదంతము మహాసే
నునకెఱింగింతము,

(నిష్క్రమణము)

శ్రీమత్ ములుగు సుబ్రహ్మణ్యారాధ్య విరచితం
కుమార విజయనాటకం
పంచమాంకము సమాప్తం



# షష్ఠాంకము.

## మొదటి రంగము

—( మందిరమున శూరపద్ముడు శయనించియుండ పద్మకోమల యుపచరించుచుండును )—

శూర— దేవీ ఇంకెక్కడి శాంతి ఎక్కడిజయము,

పద్మ— ప్రభూ ధైర్య హీనాత్ములగు మీరే ఇట్లధైర్య మంద ఆడువారలమగు మే మెట్లు జీవింపగలము,

తే॥ గీ॥ నాల్గు పంద్రంబులన నొప్పు నలుగురు సుతు
లసువులను బాయ మొండినై యక్కటకట
బ్రదికియుంటిని జీవచ్ఛవంబుపోల్కి
ఇంక విూరిట్లు పొగుల మాకేదిదిక్కు॥

శూర— నేను మాత్రము బ్రదికి ప్రయోజనమేమి నాకన్నుల యెదుటనే నన్నుద్ధరింపగల వారనేకులు మరణించిరి ఇంత వైపరీత్యము జరుగునని కలనైన దలంపనైతిని,

॥ పలువుర పుత్రులన్ గనవి ఖండనపండితులైన మంత్రులన్
బలువుర నుక్కడించి బలవంతులలో పలకీర్తిగొన్నవా
రలఘుల వాహినీపతుల నందఱ నొక్కని మేషమాత్రలో
పలహతమార్చి వాబ్రతుకు పాడొనరించి రికేమి సేయుదున్

పద్మ— పులిమీద పుట్ర మునునట్లు కబురంపినను మీతమ్ము డింతవఱకు రాని కారణమేమై యుండునో?

శూర— అకారణముగా నాతడాలస్య మొనరించువాడు కాడు,

సింహ-అగ్రజా అభివాదనము

శూర- [నిరుత్తరము]

సింహ- అన్నా నేనేమి యపరాధ మొనర్చితినని మాటాడకుంటిరి.

శూర-సోదరా! ఇందు నీయపరాధ మేమిగలదు, విధిప్రాతికూల్యమే. నాకు వాగ్బంధన మొనర్చినది.

సింహ. అన్నా! ఎన్నడు వినని మాటలు నేడు నీనోట వినుచుంటిని, నీశాసనమునకు వ్యతిరేకించి, బ్రతుకగల విధి యొకండుగలదు ఈ విచారకారణ మెఱింగినచో మీ తమ్ముడు ప్రతిక్రియ యొనర్పక మానడు.

శూర- నీభక్తి విశ్వాసములు నేనెఱుంగనివి కావు. ఈనాటి విషమ పరిస్థితు లీరీతినున్నవి.

సింహ-ఇయ్యది సంగ్రామము జయాపజయంబు లోకతీరున నుండునా.

శూ-ర- జయమను మాటయె మనకరుదైనది. తాత్కాలికానుకూల్యము ఘటించినను, మరుక్షణముననే మరువరాని సంక్షోభము సంభవించుచున్నది.

సింహ- అదేమి, అదేమి

శూర- ఏమని చెప్పుదును.

మ॥ త్రిసహస్రాత్మజులన్ గడించిమగలౌ ధీమంతులౌ మంత్రులన్
అసదృగ్వీర్యుల నిర్జితారులగు సైన్యాధ్యక్షులన్ దున్మించి రా

త్రస వంశాటలికిన్ దవానలము నై గాన్పించు నీయుర్వరకుం
దసదా వీని నెదిర్చి పోరగల వాడాత్మప్రపంచంబునన్ ॥

సింహ- అన్నా నేమొదటనే జెప్పలేదా.

తే॥ గీ॥ అతడు బాలుండు గాడు శివాత్మజుండు
వానితో మనకతగదు వైరమనుచు
నెంతజెప్పిన వినవైతి వింతవచ్చె
నీశ్వరుని యానమీరుట కెవనితరము ॥

కావున నిప్పుడైనను మన మాటని నాశ్రయించితి మేని, అభయ మందగలము.

శూర- [నిరుత్తరము]

సింహ- మీకు నేను కర్తవ్య ముపదేశించు నంతటివాడను గాను. కాని, మీరీసమయమున దీర్ఘాలోచన మొనరించుట సమంజసము.

పద్మ- ప్రభూ! మనకిది దుష్కాలము. ఆపద్ధర్మము. మీ రెఱుంగనిది కాదు. ఆతడా మనకు వరప్రదాతయగు శంకర పుత్రుడు గాని, అగర్భశత్రువు గాదు.

శూర- [పలుకడు]

సింహ- అన్నా మీరివు డభిమాన పడజగిన దేదియు గానరాదు. సెలవైనచో మీపక్షమున నేనేగి ఆమహానుభావుని బ్రసన్నుని జేసెద.

శూర- బాగు బాగు, మీయుద్దేశము లింతవఱకు దెలియని, నా యజ్ఞానమును మన్నింపుడు. బ్రిదికి బాగుపడదల

చిన మీరు, ఆతని శరణంది వర్ధిల్లుడు. నేనింక బ్రదికి ప్రయోజన మేమియు గాన్పింపదు. కావున నేనొక్కడనే జని, యాతనితో యుద్ధమొనర్చి జయమో, స్వర్గమో, యనుభవించెదను.

పద్మ- నాథా! మీకింత నైరాశ్య మేల చచ్చినవారితో జత్తుమా, గడచినదానికి వగచిన లాభ మేమియు గానరాదు. చతురుపాయ ధురీణులగు మీరాలోచింపుడు.

సింహ- అన్నా నేను పండనై ప్రాణముల నాశించి మాట్లాడుట లేదు,

శూర- నేను నిన్నేమియు కాదనను, నాకాభిజాత్యమున కన్న, ఆదరింపదగిన దేదియు గానరాదు. కావున, నామార్గము నాది మీమార్గము మీది.

సింహ- (స్వ) కాలము సమీపించినది గాన, ఈతని బుద్ధి మారదు. (ప్ర) ప్రభూ! క్షమింపుడు, మీయాజ్ఞం గొని చని. సర్వశత్రు నిర్మూలన మొనర్చిగాని, మిమ్ము దర్శింపను.

శూర- బలవంతపు బ్రాహ్మణార్థమున శ్రార్ధము చెడునుగదా

సింహ. (పాదములబడి) అగ్రజా! నా యపరాధమును క్షమించి నన్ను విశ్వసించి మరణమున కంపుము.

ఉ॥ కాలుడువీడునా రిపుల గండడగించెద వీరబాహునిం
గాలనురాచి సోదరుల గర్వముసర్వము వమ్ముజేసి దు
ష్కీలుని దారకాంతకుని జీవము లన్గొని నీదుపాద ప
ద్మాలను బూజజేతు నది తథ్యమునమ్ముము రాతి నేశ్వరా

మఱియును,

చ॥ ప్రతిఘులఁ జంపి భూతముల ప్రాణములన్ గొని శత్రుసైన్య వ్యూ
హములఁ జిరాశొనర్చి దివిజాంతకుఁ డీతఁడటన్న సద్యశో
రమను గణించి లోకముల రాయిడిపెట్టక యున్న నామ చే
తమునకు శాంతిగల్గునె వృథావచనంబుల నిట్టిపట్టునన్॥

శూర — (పలుకఁడు)

సింహా — దయానిధీ! మీరిపుడు నా కాజ్ఞ నీయరేని,

ఉ॥ మీపద సన్నిధానమున మేను త్యజించెద నాత్మహత్యయన్
బాపము దాపరించినను భాగ్యమటంచు సమాదరించెదన్
నాపయి కోపమూనకు మనాదరణంబును వీడుము గ్రిజా
జ్ఞాపరిపాలనంబునకు జాలనివానికి శిక్షయిద్దియే॥

శూర — తమ్ముఁడా! అతివిచారమున నీయభిప్రాయ మెఱుంగ
నైతివి, ఇతికర్తవ్యతామూఢుఁడనైన నా కేమియు
పాలుపోవుట లేదు.

సింహా — ఐన నా ప్రతిజ్ఞ వినుఁడు,

తే॥ గీ॥ ఖండనంబున దేవతా ప్రతతి నెల్ల
సర్వనాశనమొనరించి సకలదైత్య
తతికి ముదమిడలేని నాబ్రదుకు రణము
నందె పర్యవసానంబు నందుఁగాక॥

శూర — విజయీభవ సమస్తబల సమేతుఁడవై సంగ్రామము
నకు జనుము.

(తెర బడును)

# రెండవ రంగము.

—( పటకుటీరమున పరివారసమేతుడై సుబ్రహ్మణ్యుడుండును )—

విష్ణు- సుబ్రహ్మణ్యేశ్వరా

ఉ॥ నీ మహిమా విశేషముల నెవ్వరు వర్ణనసేయజాలు నా
నా మహిమాత్మ తారకుని నద్భుతలీల నెదిర్చి ఘోర సం
గ్రామ మొనర్చి తుట్టతుద కాతనిచే విజయుండ నైతి నీ
నా మొనగాని నొక్క త్రుటి నంత మొనర్చితి వౌర షణ్ముఖా॥

బ్రహ్మ- లక్ష్మీపతీ నాకు నీమాటలు విచిత్రముగా నున్నవి

ఉ॥ నీకును నాకు వారల ననిన్ దెగటార్చెడి శక్తియున్నచో
నాకనివాసులీగతి వనంబుల గుట్టల నోవసించి చీ
కాకును బొంది యుండుటకు కారణమున్నె తలంచి చూడ మీ
రీకరణిన్ వచించుట మహేశ్వర తత్వ మెఱుంగకుంటయే॥

బృహ- పితామహా మీరట్లు తలంచుట సమంజసముగాదు,

తే॥ గీ॥ వేయి తామరపూలచే విష్ణువీశు
దక్షు బూజింప నొక్కడౌ ప్రసూన
సమితియందొండు తక్కువై చనగ తనదు
నేత్రమిడి గాదె శివుదయాపాత్రుడయ్యె॥

(పటాక్షేపమున భటుడు ప్రవేశించి)

భటు- మహాప్రభూ తామాలసించిన దేవసేనయంతయు
క్షణకాలమున నశించగలదు.

బృహ- ఓయీ ఇప్పుడంత ప్రమాదమేమి సంభవించినది?

భటు- ఇది ప్రమాదముగాదు సమాప్తమే

బ్రహ్మ-ఓహో ఏమి యీ విపరీతము

భటుఁ- దయామయా మీరిప్పుడు రణరంగమునకు వేంచేసినచో ప్రమాదము దప్పదు.

కుమా- ఓయీ దైన్యమువహించి జరిగిన విశేషమంతయు దెల్పుము

భటు- స్వామి యిదివఱకెన్ని యుద్ధములో గాంచితిగాని యింత ఘోరాతి ఘోరము నెన్నఁడును జూడము.

ఉ॥ దానవు పెద్దతమ్ముఁడట చోద్యమె పర్వతపంక్తి వారలన్
బోరున నోరువిప్పి బలి భుక్కువిధంబున మ్రింగుచుండె నా
ఘోరము జూచి దద్దరిలి గొబ్బున నీపదపద్మ ధ్యానముం
జేరితి విన్నవింప నెటు సేసెద నీదయ పార్వతీసుతా॥

విష్ణు- మహాసేనా అతఁడు సహస్రముఖుఁడగు సింహవక్త్రుఁడు ఆతని రెండువేల చేతులతో అమర సేననంతయు అర నిముసములో గ్రహింపగలఁడు,

కుమా- మ్రింగిన జీర్ణము గాగలదా,

విష్ణు- దేవర మహిమా విశేషము తెల్లియుంగగలము.

కుమా- అయిన నాలస్యమేల తెండు [భటునితో] నీవేగి నారాకఁ దెలిపి సేనల బురికొల్పుము.

భటు- నేఁబోవు వఱకు మిగిలినగదా.

కుమా- వెఱ్ఱివాఁడా పొమ్మా [భటుఁడేగ విష్ణునితో] ఆతఁడంత సాహసుఁడా?

విష్ణు- ఏమని చెప్పుదును మహాత్మా

చ॥ కదనమునందు శిష్టు వెనుకంజ నెఱుంగని మూర్ఖరాక్షసుం
డదయుఁడు మృత్యువన్నను గనంతయు జంకనిదిట్ట అగ్రజుం
డెదిని యమింప నయ్యదియె యీశ్వరునాజ్ఞగ నెంచి తత్క్షణం
బనియొనరింపజాలిన దురాత్ముఁడతండునుమీ వధానవా॥

ఈ వశా- అట్లయిన యుక్తాయుక్త విచారశూన్యుడగు నీతడవశ్యము దండనార్హుడే

విష్ణు- చిత్తము.

(తెరబడును)

## మూడవ రంగము

(ఆకాశమున నారదుడు నృత్యమొనర్చుచుండును)—

—♦ గేయము ♦—

నార- ౧. ఆనందం పరమానందం బ్రహ్మానందం ప్రియా
నందం సూనశరాంతసూను విక్రమమనూనమనన్య
మహాద్భుతంబహో ।

౨. ఆర్తత్రాణపరాయణుండైన కార్తికేయునిద్రోలి
యజాలకీ ధూర్తరాక్షసుండా హావమున నెంతో
గాసింపబడి కుందుచుండెనహా ।ఆ।

ఔరా! ఏమి వీని మూర్ఖము, ఇప్పటికైనను సుబ్రహ్మణ్యుని మహిమా విశేషములు తెలియజాలడు గదా.

విష్ణు- (ప్రవేశించి) నారదా లోకములన్నియు నల్లకల్లోలము లగుచుండ నీవు మహదానంద పరవశుండవై కాన్పించుచుంటి వేమి.

నార— భగవాన్ ఏమెరుగనట్లు నన్నడుగుచుంటివా అల్లకల్లో
లమునకు కారణ మాత్మాపరాధముగాదా అభయ
ప్రదాతయగు కుమారదేవుని పరివారమునకు పరా
జయమా.

విష్ణు— సింహవక్త్రుడు సామాన్యుడుగాదా అతని నిర్జించుట
సాధ్యమా

నార— సాధ్యమో అసాధ్యమో అటుజూతము.

తే॥ గీ॥ బాహులేయునిచే దునుమింపబడిన సింహ
ముఖుని శిరములు కరములు ఘోరభీకర శ
రముల నెల్లెదనిండిన రాశులందు
నంత భయమందదేమి యీ చోద్యమనఘ॥

విష్ణు— అతని ధైర్యస్థైర్యము లద్వితీయములు.

నార— (మరలజూచి) మాధవా! వీడెంతవాడైనను మహాసే
నునిముందితడు దివిటీముందలి దీపముగాకపోడు. ఆహా
ఎంత విస్మయము

తే॥ గీ॥ తర్జనింజూపి భర్జింప దానవాధముని
శిరంబులు కరములు మునుపటివలె
మొలవకున్నను రాక్షసుండలిగి కంద
సామి జంపంగ జనుచుండె సత్వరముగ॥

విష్ణు— ఇక మనమేగి ముందేమిజరుగునో చూతము పద
(పోదురు తెరబడును)

—(రక్తసిక్తాంగుడగు సింహవక్త్రుడు ప్రవేశించి)—

సింహ— ఓరా ఎంత మహానుభావుడీ బాలుడు ఆజ్ఞామాత్ర

మునసే అభవుని వర ప్రభావముగూడ వమ్మయ్యెనే కానిమ్ము ఇదియొక మాయాకృత్యము గావచ్చును ఓ డింభకా— ఇటువంటి గారడీలకు భయపడువాడను గాఁడీ సింహవక్త్రుడు,

శా॥ అత్యాశ్చర్యమునన్ సురాదులు మహాహ్లాదంబునన్ బొంగ నా
పత్యుల్ నీ పడుపాట్లు వెల్లగని కోదండంగ యీవాడె యీ
యత్యాచారము లెల్లవెల్లడచి నీకంఠంబు చేకూర్చి యా
ధృత్యంబున్ బ్రకటింతు గన్గొనుము మత్సామర్థ్యమో డింభకా॥

[త్రిశూలహస్తుడగు కుమారుడు సానుచరుడై ప్రవేశించును]

సింహ—(కుమారుంగాంచి నమ్రుడై) ఆహా! ఏమి యీదివ్య తేజము దుర్నిరీక్ష్యముగదా.

కుమా—ఏమది నిశ్చేతనుడవైతివేమి.

శా॥ నీసామర్థ్యము జూపి బాలకులన్ నిర్జించి నన్ బట్టి బల్
గాసింబెట్టి వధింతునంచు బలుకన్ గాలేదె యిప్డేల నా
యాసంబెల్లను మాటుపెట్టితివి నీలోనింతలో నిట్టి వ్యా
త్యాసంబేమి కతంబునన్ గలిగె దైత్యాధీశ దెల్పంగదే॥

సింహ—[కరములు జోడించి]

శా॥ స్వామీ ధూర్తుడనై భవన్మహిమ లేశంబైన గుర్తింప కే
కేసేమో వచియించి మీకది కసంతృప్తిన్ బ్రపాదించితిన్
నా మూర్ఖ్యంబు సహించి బ్రోతువని నిన్నర్థింతు నమ్రత్వమొ
స్వామి ద్రోహము వాప నీ వగతి సుబ్రహ్మణ్య దీనావనా॥

కుమా—ఓరీ పిపీలికపంత ఏమనుచుచుంటివి నీ వింతకుముందాడిన

ప్రగల్భములన్నియు. నేయేటగల్పితివి,

తే॥ గీ॥ ప్రజమసైపై యాసనిన్నిట్టి పౌరుషాగ్ని
నూనశూన్యునిగా జేసెగాని లేక
యున్న నే పూరుషుండైన యుద్ధరంగ
మందు నీ పేడిమాటల నాడగలడె॥

సింహ-(హుంకరించి) ఓరా ఏమంటివి

తే॥ గీ॥ శివకుమారుండవని నమస్కృతినొనర్ప
నద్ది నాధైర్యహీన కృత్యముగనెంచి
బలుకుచుంటివె వేడు నా పాటవంబు
చూచెదవుగాక జగములు చోద్యమంద॥

(అని గద గైకొని పైకురుక కుమారుడు త్రిశూలము సింహవక్త్రునిపై బ్రయోగించును)

(తెఱపడును)

## నాల్గవరంగము

— ( నారదుడు ప్రవేశించును ) —

నార- — గేయము —

౧. తెలియుగవశమా యీ దానవులకు దేవసేనాధీశుని మహిమన్
ఖలులై యుక్తాయుక్త మెఱుంగక కార్తికేయునిన్ దలపడ నెంచిరి ॥తెలి॥

౨. కాలకాలుడగు పరమేశుని సంకల్పము నకును,

వికల్పముఁ గలదా బాలుఁడైన యీ బాహులేయుఁడవ
లీల దైత్యసంహార మొనరించె ॥తెలి॥
ఔరా యీ శూరపద్మాసురుఁ డెంత మూర్ఖుఁడు ఇప్పటి
కైనను వీనిబుద్ధి మారదుగదా విశ్వరూప సందర్శన
మున సైతము విజ్ఞాన మొదవదయ్యె,

ఉ॥ తల్లి నశించెఁ బిన్నదు దానవసైన్యము నిర్విశేషమై
బల్లిదులైన పుత్రులును భ్రాతలుఁబోయిన నంతయేనియున్
తల్లడమంది యాత్మబల దర్పములన్ విడనాడ దక్కటా
యొల్లియుతండుగూడ మరణించుట తథ్యము తథ్యమెట్టులన్॥

శూర—(ఖడ్గహస్తుఁడై ప్రవేశించి) ఎవఁడా యమంగళ వాచా
లుఁడు యీ కరవాలమున నాతని నాల్కఁ జీల్చెదను
(దిక్కులు చూచుచుండ నారదుఁడు పోవును)
ఓరీ వదరుబోతా ఏమని ప్రేలుచుంటివి,

ఉ॥ నన్ను రణంబునన్ గెలిచినట్టి పరాక్రమశాలి మున్ను నీ
వెన్నఁడు గాంచి యీగతి వచింపుచు నుంటివొ దెల్పుమట్లుగా
కన్న భవచ్ఛిరంబు తెగఁగోసెద నిట్టు వృథాప్రగల్భముల్
పన్నినదానికిన్ దగిన బన్నము దప్పదు దేవుఁడడ్డినన్॥

సమా—(ప్రవేశించి) ఓరీ విచారవిదూరా శూరపద్మాసురా
ఏమని ప్రేలుచుంటివి

కం॥ ఎదిరించి పోరజాలక
కదనమున నదృశ్యమందె కన్పడుజనులన్
బెదరించి బ్రదుకజాలిన
మదమొదవునె మహాత్మువంటి పురుషులకెపుడున్॥

శూర- ఎంతమాట నీకుభయపడి అదృశ్యమైతినా ఆహా ఏమివింత.

ఉ॥ పేర్చెదు శేవునీవు పరవీరభయంకరశూర శూరుడే
లీల భవత్ప్రతాపమున డీల్పడె నిట్టి వృథాప్రగల్భముల్॥
చాలు ముదంబడెన్ వయసు చాలనికుఱ్ఱతో దబోవినన్
గేలియొనర్పరే నను నికృష్టునిగా దలపోయరందరే॥

తే॥ గీ॥ బ్రదుకదలచిన నిప్పోటు బానిచనుము
నే విజృంభింప నిన్నన్న దేవదేవు
డైన వారింపజాలడీ వనగ నెంత
సత్యము వచించువాడ నిస్సంశయముగ॥

కుమా- ఏమి ధైర్యస్థైర్యములు ఎంతకరుణా పారీణత్వము ఇంతినమున్న గుణంబులు నీ కలవడిన వేయునెనిమిది బ్రహ్మాండములలోని దైత్యులు బ్రదికిపోదురుగదా కాలవిపర్యాసమున నీకానాడీ సద్బుద్ధి కలుగదయ్యె,

శూర- ఓరీ దురహంకారపారీణా ఇంకను నీ వాచాలత్వము మానవా?

కుమా- మానినను మానకున్నను నా మాటలయందు సత్యమే మైన నున్నదా యోజించి వచింపుము,

శూర- ఆహాహా చాల గొప్పవాడవు,

ఉ॥ చీమలమూకలన్ జిదుము సింహపరాక్రమశాలి వీవు ని
క్కమని ప్రస్తుతింపగల రీభువిగల్గిన వీరవర్యులిం
ద్దాముడ వైననిన్ననిన ధైర్యము సర్వము సన్నగిల్లె సం
గ్రామము మానెదన్ కనికరంబున నన్గను మోకృపానిధీ॥

కుమా-ఓరా! మేమెంత పరిహాసపాత్రులమైతిమి ఇప్పుడే మనుగొన్న నేమున్నది, పెడకుబడిన పాము కఱువక మానునా,

శూర-మేమాడుమాటలన్నియు వేళాకోళములుగా నెంచుచుంటివి బుద్ధిః కర్మానుసారిణీ విధి నెవరు తప్పింపగలరు.

కుమా-ఇంత విజ్ఞానముగల నీవు ఈ వృథా వాక్యకాలక్షేప మొనరింతువు,

శూర- అదియునొక తప్పుగానే పరిణమించినదా

తే॥ గీ॥ కుసుమ సుకుమారమైన నీ కోమలాంగ
మెట్లు నా వాడికత్తి ఖండించుననుచు
సంశయింపుచున్న నా శాంతివృత్తి
సరియవైతివి బాలుడ వైనకతన॥

కుమా-ఓరీ రాక్షసాధమా నీవక్రజిత్తులు నేనెఱుంగనివిగావు

కం॥ బాలుడనో నీపాలిటి
కాలుడనో తెలియగలవు బవరంబున నిం
కాలస్యమేల నీబల
పౌరుషముఁ జూపి గెలువ పాడియగునమీ

శూర-పిట్ట కొంచెమైనను కూత ఘనముగానున్నది, నీమాటలవలన జనించెడి యాశ్చర్యకు నీ కౌమారసౌకుమార్యము లడ్డుపడుచున్నవి— అదియునుంగాక,

కం॥ మదుపాసన దైవంబగు
మదనాంతక పుత్రుఁడవు కుమారుఁడవగుని

న్నదిరించి పోరుటకు నా
మది సంశయమందె వినుము మావాక్యములన్॥

కుమా-నీ వెన్నిమాటల నన్ను మోసగింపఁజూచినను ఈ మారు నిన్ను ప్రాణములతో విడువను

శా॥ నీ పాపంబు ఫలించె గావున రణక్షోణిన్నినుంగూల్చి యే
కాపట్యంబు నెఱుంగనట్టి దివిజేశుంబున్ జెరన్బాపి చే
కాపాడన్ సమకట్టినాడ నిక నీకేల నీదు సంగ్రామ వి
ద్యా పాండిత్యము జూపగా వలయు ధైర్యంబున్న దైత్యాధమా

తారక-నీ వెన్ని దంభములు పల్కినను నీపై నాకాగ్రహము జనించుటలేదు, కావున నీవే బాణప్రయోగమారంభింపుము.

కుమా-నా ప్రయోగము నీ వియోగమునకు కారణముగాదు గదా.

తారక-ఓహో ప్రతిమించి రాగమున బడినది ఆలస్యాదమృతం విషంబనినారు గావున నిన్ను క్షమింపను,

తే॥ గీ॥ మత్తగజరాజ మాకలి మంటచేత
నెంచి తామర తూడుల ద్రెంచినట్లు
లస్మదీయ కరస్థ ఖడ్గాసివలన
నీదు కంఠంబు ఖండింతు నిపుడెగనుము॥

అని కత్తిచేబూని పైకుఱుక కుమారుడు శక్తి గైకొన సూరుడదృశ్యుడగును —

కుమా-ఓరీ మాయావీ నీ మాయలన్ని యిటు మటుమాయమగు

కాలమాసన్నమైనది,

(నేపథ్యమున) మహాసేనా త్వరబడుము సంద్రమంతయు నిండిన శాఖలతో బ్రహ్మాండమంతయు నిండిన చూతవృక్షమై రాక్షసుడు భయంకర రూపము దాల్చినాడు,

కు. మా — అమరులారా! వెఱువకుడు ఈ క్షణముననే యాతని బరిమార్చెదను (శక్తినుద్దేశించి)

తే॥ గీ॥ ఓ మహాదేవదత్తమా యుగ్రశక్తి
రాజమా యీ క్షణమున సంభ్రమున నేగి
అసురమాయలనెల్ల మాయంబొనర్చి
ప్రాణములదీసి శైలంబరిమ్ము పొమ్ము॥

(అని శక్తిం బ్రయోగించును)

(నేపథ్యమున) కుమార మహారాజునకు జయ్.

తే॥ గీ॥ పార్వతీనందనా శూరపద్మదైత్య
దనువులన్పాసి కుక్కుటంబై మయూర
రూపమున్ దాల్చి యుష్మత్సమీపమునకు
వచ్చుచున్నాడు వినుమని మచ్చరమున॥

కు. మా — ఓయీ మీయూహ సరియైనది కాదు,

తే॥ గీ॥ అతడు నాశక్తివలన దేహాంతమంది
భక్తుడై మమ్ము సేవింప వచ్చుచుండె
గాని కీడొందుగను మీకతని వలన
గలుగగలకీడు లేశంబు గానరాదు॥

( బ్రహ్మాది దేవతలు ప్రవేశింతురు )

దేవేం- మహానుభావా సుబ్రహ్మణ్యదేవా

కం॥ కరుణా వరుణాలయ మీ
వరవాత్సల్యమున సర్వబాధలణంగెన్
పరమానందంబొదవెన్
దురితంబులు వాసి సకల దుఃఖములరిగెన్

కుమా- మీ యభీష్టములన్నియు నెఱవేరినట్లేగదా.

బ్రహ్మ- కార్తికేయా నీదయావిశేషమున నన్నియు సమకూరినవి కాని యీ దేవేంద్రుని వాంఛ యొకటికలదు మన్నింతురుగాక,

తే॥ గీ॥ దేవసేనకు విభుఁడవై దితిజబాధ
లెల్ల మాన్పితివిపుడు మా యుల్లమలర
దేవసేనను పెండ్లాడి దివిజలోక
మెల్ల కల్యాణమయము గావింపుమయ్య॥

కుమా- మంచిది అట్లేకానిండు,

దేవతలు— ధన్యోస్మి ధన్యోస్మి

( తెరబడును )

## ఐదవ రంగము.

—( కల్యాణ మంటపము )—

పార్వతీ పరమేశ్వరులు బ్రహ్మాది దేవతలు కొలువుదీరి యుండ
దేవసేనా కుమారులు కల్యాణవేషమున సింహాసనమున
గూర్చుందురు,

పర - కుమారా శూరపద్మాసురుడు మహాభక్తుడయ్యును గర్వాతిరేకమునకుండగిన ఫలమనుభవించి, విజ్ఞానియై నీ సేవగోరుచుండెగావున వీని ననుగ్రహించి వాహన కేతనములుగా నంగీకరింపుము,

కుమా - మహాప్రసాదము.

బ్రహ్మ - సమస్త సన్మంగళానిభవంతు

పర - అయిన నిట్లగుగాక,

—భరతవాక్యము—

తే॥ గీ॥ ద్వేషమడుగంటి ప్రేమ వర్ధిల్లుగాక
హింసనశియించి దయ ప్రజ్వరిల్లుగాక
క్షేమలేమియై సంపదల్ నిలుచుగాక
జగములన్యోన్యమైత్రిచే నెగడుగాక

—జయతు—

శ్రీమత్త్రిలోక గురువేమనారాధ్య వంశోద్భవ
మలుగు సుబ్రహ్మణ్య ప్రణీతంబగు
కుమార విజయనాటకం
సమాప్తం
శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీ రామలింగేశ్వర ప్రెస్, స్టేషన్ రోడ్ వరంగల్.